## శ్రీమద్ధర్మనిర్ణయచంద్రిక యను గ్రంథ సంగ్రహమున కుపయోగించిన గ్రంధముల జాబితా

1. కాలామృతము.
2. ముహూర్తదర్పణము
3. ముహూర్తమార్తాండము
4. దైవజ్ఞకర్ణామృతము
5. ఫలప్రదర్శిని
6. శాంతికమలాకరము
7. త్రింశచ్ఛ్లోకి
8. అభినవ షడశీతి
9. స్మృతిరత్న మహోదధి
10. స్మృతిసారసముచ్చయము
11. ధర్మసింధు
12. ధర్మప్రవృత్తి
13. నిర్ణయసింధు
14. మనుస్మృతి
12. పరాశరస్మృతి
16. యాజ్ఞవల్క్యస్మృతి
17. వైద్యనాథదీక్షితీయము
18. మల్లాజీయము
19. లక్ష్మీపతిసోమయాజీయము
20. వేంకటసోమయాజీయము
21. ధర్మసంగ్రహబోధిని
22. యాజుషప్రయోగచింతామణి
23. ఆశౌచత్రిశతి
24. అశౌచ శతకము
25. అఘవివేచనము
26. ఆశౌచ నిర్ణయము

# ధర్మనిర్ణయ చంద్రికాస్థిత విషయానుక్రమణికా

శ్రీ మహాగణాధిపతయే నమః — శ్రీ మహాసరస్వత్యై నమః

శ్రీ గురుభ్యోనమః

# ధర్మనిర్ణయ చంద్రిక

## ప్రథమభాగః ప్రారభ్యతే

### ఇష్టదేవతాగురుప్రార్థనమ్

శ్లో॥ శ్రీమద్గణాధిపం వాణీం రామం వేంకటనాయకం।
పరాశరమనువ్యాసయాజ్ఞవల్క్యముఖాన్ మునీన్॥

నవగ్రహాన్ మమ గురుం ధర్మశాస్త్రవిశారదమ్।
వేంకట్రామం శాన్తచిత్తం సోమయాజిపదాంకితమ్॥

గరికిపాట్యన్వయాంభోధిపూర్ణచంద్రం బుధోత్తమమ్।
ధర్మజ్ఞ మస్మదాచార్యం నామ్నా వేంకటశాస్త్రిణమ్॥

నమస్కృత్య ప్రారభే ఽహం జనసందేహవారిణీమ్।
ధర్మప్రబోధినీం పుంసాం ధర్మనిర్ణయచంద్రికామ్॥

ఆలోడ్య స్మృతిజాలాని చైకీకృత్య విశేషకాన్।
దేశాచారంచ సంపాద్య శిష్టాచారం తథైవచ॥

తత్సారం సమ్యగుద్ధృత్య సప్రమాణ మతిస్ఫుటమ్।
శాన్త్యాశౌచముఖాన్ ధర్మాన్ వక్ష్యే ఽహం మమ శక్తితః॥

## వివాహయోగ్యాయోగ్యసంబంధః

### కాలామృతే

శ్లో॥ చాతుర్థీంచ వధూం చతుర్థపురుష స్త్రాం పంచమీం చోద్వహే
న్నో షష్ఠీంతు సముద్వహేత్తు యువతీం నోపంచమీంపంచమ,
తార్తీయాంచ వధూం తృతీయపురుష స్త్రా ముద్వహే న్నోద్వహే
దిత్యన్యే ప్రవదంతి సప్తమజనా దూర్ధ్వం పరేషా మివ ॥

శ్లో॥ పంచమః పంచమీం కన్యాం నోద్వహే దితి య ద్వచః ।
పితృపక్షే నిషేధోయం మాతృపక్షే న తద్భవేత్ ॥

తా॥ కూటస్థపురుషుడు మొదలు 4 వ పురుషుడు 4 వ స్త్రీనిన్నీ 5 వ స్త్రీనిన్నీ వివాహమాడవచ్చుననియు; చతుర్థపురుషుడు షష్ఠస్త్రీని వివాహమాడరాదనియు 5 వ పురుషునికి 5 వ స్త్రీని వివాహముచేయరాదనియును, 3 వ పురుషునికి 3 వ స్త్రీని వివాహముచేయవచ్చునని కొందరును చేయరాదని కొందరును చెప్పిరి. ఈచెప్పబడిన నియమము సప్తమపురుషపర్యంతమేగాన అనంతరము సామాన్య బంధుసంబంధముపలెనే వివాహముచేయవచ్చునని తాత్పర్యము ఈపంచమస్త్రీ పంచమపురుష వివాహము తండ్రివరుసగూడదనియు తల్లివరుస నుత్తమం బనియు కొందరిమతము.

### యాజ్ఞవల్క్యః

శ్లో॥ అరోగిణీం భ్రాతృమతీం అసమానార్షగోత్రజామ్ ।
పంచమా త్సప్తమా దూర్ధ్వం మాతృతః పితృత స్తథా ॥

తా:- రోగము లేనట్టియు, సోదరులు కలిగినట్టియు, అన్యగోత్రజాతయు నగు స్త్రీని వివాహమాడవలెను. తల్లిగోత్రములో కూటస్థ పురుషునినుండి 5 వ తరము తర్వాత స్త్రీని, తండ్రిగోత్రములో కూటస్థ పురుషునినుండి 7 వ తరము తర్వాత పురుషుడు వివాహమాడవచ్చును

ఏకనక్షత్రైకపాదజాతయో ర్వివాహనిషేధః - కాలనిర్ణయే

శ్లో॥ దంపత్యో రేకనక్షత్రే భిన్నపాదే శుభావహమ్ ।
దంపత్యో రేకపాదేతు వర్షాంతే మరణం ధ్రువమ్ ॥

తా:- దంపతు లేకనక్షత్రమందు జన్మించినను భిన్నపాదమైనచో దోషములేదు. ఒకే పాదమైనచో వివాహము చేయరాదు.

ఏకగోత్రజాతయో ర్వివాహనిషేధః

శ్లో॥ సమానగోత్రప్రవరాం కన్యా మూ ఢ్వోపగమ్యచ ।
తస్యా ముత్పాద్య చాండాలం బ్రాహ్మణ్యాదేవ హీయతే ॥
పరిణీయ సగోత్రాంతు సమానప్రవరాం తథా ।
త్యాగం కృత్వా తత స్తస్యాః ద్విజ శ్చాంద్రాయణం చరేత్॥
ఉత్సృజ్య తాం తతో భార్యాం మాతృవ త్పరిపాలయేత్ ॥

తా:- సమానప్రవరగాని, సమానగోత్రముగాని కలిగినకన్యను వివాహమాడి, దానియందు పుత్రుని కనినచో వాడు చండాలు డగును. అట్టివానికి బ్రాహ్మణ్యము నశించును. కనుక నట్టిదానిని వదలి యామెను తల్లివలె పరిపాలించవలెను. తాను చాంద్రాయణవ్రతము నాచరించవలెను.

శ్లో॥ ఏకఏవ ఋషి ర్యావ త్ప్రవరే ష్వనువర్తతే ।
తావ త్సమానగోత్రత్వం వినా భృగ్వంగిరోగణాః॥

తా:- ఒక ఋషియైన ప్రవరలలోకలిసినచో సమానగోత్రత్వము వచ్చును. కనుక నట్టి కన్యను వివాహ మాడరాదు.

భృగు అంగిరో గణములు ప్రవరలలో కలిసినను దోషము లేదు. అట్టి కన్యను వివాహమాడవచ్చును.

నోటు :- గోత్రప్రవరలవిషయమును విపులముగా 'ధర్మసింధు'లో చూడనగును.

అథ గండర్క్షజాతకన్యాఫల మాహ

శ్లో॥ మూలజా శ్వశురం హంతి వ్యాళజాచ తదంగనాం ।
జ్యేష్ఠజా భావుకం హంతి దేవరంతు ద్విదైవజా ॥
మూలాశ్లేషావిశాఖాసు మాహేంద్రే చోద్భవః పుమాన్ ।
న దోషకృ ద్వివాహేచ స్త్రియ స్త్వేతేషు వర్జితాః॥
తులాయుక్తే ద్విదైవత్యే జాతా నారీ న దోషభాక్ ।
కార్పియుక్తే ద్విదైవత్యే జాతా హంతిచ దేవరమ్ ॥

తా:- మూల, ఆశ్లేష, జ్యేష్ఠ, విశాఖ నక్షత్రములయందు పుట్టిన కన్యకలు వరుసగా మామ, అత్త, బావ, మరిది వీరలకు హంతకురాండ్రగు చున్నారు. కనుక నాయానక్షత్రములయందు జన్మించిన కన్యకలను మామ మొదలగువారున్నవారు వివాహమాడరాదు. పురుషుల కీ దోషము లేదు. తులాలగ్నముతోగూడిన విశాఖానక్షత్రమునందు జన్మించినస్త్రీ దోషయుక్తురాలు కాదు. వృశ్చికరాశితోగూడిన విశాఖానక్షత్రమందు పుట్టిన స్త్రీ యధికదోషయుక్తురాలు.

వివాహే వర్జ్యనక్షత్రాణి

శ్లో॥ కృత్తికా భరణీ జ్యేష్ఠా పుష్యాశ్లేషా పునర్వసూ ।
ఆర్ద్రా త్రిపూర్వా చిత్తాచ వైధవ్యం మరణం ధృవమ్ ॥

శుభకార్యేషు యోగ్యనక్షత్రాణి

శ్లో॥ అశ్వనీ మృగశీర్షంచ హస్తాత్రయ పునర్వసూ ।
శ్రవణాదిత్రయం మైత్రీ పుష్యా మూలోత్తరాత్రయం ॥
రేవతీ రోహిణీ ఏతే ఋక్షా స్సప్తదశా అపి ॥
కృష్యారంభే గృహారంభే ప్రవేశే బీజవాపనే,
క్రయేచ విక్రయేచైవ వివాహాది మహోత్సవే ।
హస్త మౌంజికబంధావి వస్త్రాభరణభూషణే,

క్షేత్రారంభే విభాగాది పశుకర్మాభిషేచనే।
శాంతిపౌష్టికకర్మాది కుర్యాద్ద్వ్యాది శుభం భవేత్॥

సుముహూర్తానాం శుద్ధిప్రకరణమ్

శ్లో॥ నామ్నిచ ద్వాదశే శుద్ధిః శ్రాద్ధే చైకాదశే తథా।
భోజనే దశమే శుద్ధిః నవమే చౌలకర్మణి॥

ఉపనీతే ష్టమే శుద్ధిః వివాహే సప్తమే తథా।
షట్ శుద్ధి ర్నవవస్త్రేతు ప్రయాణే పంచమే తథా॥

విద్యారంభే చతుశ్శుద్ధిః కృష్యారంభే త్రయ స్తథా।
గృహప్రవేశే ద్వే శుద్ధిః లగ్నశుద్ధి స్తు సంగమే॥

కుజదోషః

శ్లో॥ కుటుంబేచ వ్యయే సౌఖ్యే సప్తమే వాష్టమే కుజే।
పుంసాం భార్యావినాశ స్స్యాత్ స్త్రీణాం వైధవ్య మాదిశేత్॥

ఉచ్ఛస్థే సప్తమే సూర్యే తదసౌ రవిసంయుతే।
దంపత్యోః కలహం నిత్యం తౌ పుత్రౌ షష్ఠరాశిగౌ॥

ద్వితీయే భౌమదోషస్తు యుగ్మకన్యకయో ర్వినా॥
ద్వాదశే భౌమదోషస్తు వృషతౌళికయో ర్వినా॥

చతుర్థే భౌమదోషస్తు మేషవృశ్చికయో ర్వినా
సప్తమే భౌమదోషస్తు మకరకర్కటయో ర్వినా॥

అష్టమే భౌమదోషస్తు ధనుర్మీనద్వయో ర్వినా॥
కుంభే సింహే న దోషస్తు ప్రత్యక్షం దేవకేరళే॥

గురుమంగళసంయోగే కుజదోషో న విద్యతే।
చంద్రమంగళసంయోగే కుజదోషో న విద్యతే॥

గ్రంథాంతరే

శ్లో॥ ధనే వ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే।
స్త్రీణాం భర్తృవినాశః స్యాత్ పుంసాందారవినాశనమ ॥
ద్వితీయే ద్యూనగే పుంసాం స్త్రీణాం చత్వారి రిప్పగే।
ఉభయో రష్టమే చైవ భౌమదోషం విదు ర్బుధాః॥
వాగంబుకందర్పమృతిం వ్యయస్థే
కుజేతు పాణిగ్రహణం న కుర్యాత్ ।
బుధార్యయుక్త స్త్వథవా నిరీక్షితే
తద్దోషనాశం ప్రవదంతి సంతః ॥

ఏకస్మై వరాయ దుహితృద్వయదానవిచారః

ముహూర్తమార్తండే

శ్లో॥ నైకస్మై దుహితృద్వయం సహజయో ర్నైకోద్భవే కన్యకే ॥
దద్యా దుద్వహనం మిథో న తనుయాత్కు ర్యాదసంప ద్యతః॥

శ్లో॥ ప్రత్యుద్వాహో నైవ కార్యో నైకస్మిన్ దుహితృద్వయమ్ ।
నచైకజన్యయోః పుంసో రేకజన్యేతు కన్యకే ॥

వా:- ఏకస్మై వరాయ దుహితృద్వయం, - ఏకోద్భవ కన్యాద్వయం న దద్యాత్। సహజయోః ఏకోదరసంభవయోర్భ్రాత్రోః।ఏకోద్భవే కన్యకే న దద్యాత్। తథా: మిథః - పరస్పరం।ఉద్వహనం న తనుయాత్, అత్రాపి సంకటే ప్రవృత్తిమాహ కుర్యా దితి - అదః - నైకస్మై ఇత్యాద్యుక్త మకర్తవ్యం। అసంపది - అన్యవధూవరాలాభే సతి కుర్యాత్.

తా:- ఒకవరునికి ఏకగర్భజాత లగు కన్యల నిద్దర నీయరాదు. అట్లే ఏకగర్భజాతలగు సోదరద్వయమునకు ఏకగర్భజాతలగు కన్యాద్వయము నీయరాదు. భిన్నోదరులైనచో దోషము లేదు. కుమార్తె మరణించినచో నాయల్లునికి మరియొక కుమార్తె నిచ్చుట ఆవరణలోనున్నది.

## ముండన మండన విచారః

శ్లో॥ ముండనా న్మండనంచైవ మంటనా న్నరితు ముండనం ॥

తా:— ఒకయింటిలో నుపనయనము వివాహము చేయవలసి వచ్చినచో ముందుగా నుపనయనముచేసి పిమ్మట వివాహము నాచరించ వలెను,

## త్రిజ్యేష్ఠ స్వరూపమ్

శ్లో॥ ఆద్యగర్భప్రసూతాయాః కన్యకాయా వరస్యచ ।
జ్యేష్ఠమాసే న కుర్వీత కదాచి దపి మంగళమ్ ॥

తా:— తొలిచూలున జన్మించిన కన్యావరులకు జ్యేష్ఠమాసమున వివాహము చేయరాదు,

శ్లో॥ ఆద్యగర్భే ద్వయో ర్యత్ర జ్యేష్ఠానక్షత్రజాతయోః ।
జ్యేష్ఠమాసే న కుర్వీత జ్యేష్ఠపంచక మీరితం ॥

ఇద్దరును తొలిచూలున జ్యేష్ఠానక్షత్రమున జన్మించినచో వారికి జ్యేష్ఠమాసమున వివాహముచేయవలసివచ్చిన నది జ్యేష్ఠపంచక మగును. అదియును పనికిరాదు. కనుక నేవిధముగానైన 3 జ్యేష్ఠలు కలిసినచో జ్యేష్ఠమాసమున వివాహము చేయరాదు.

శ్లో॥ జన్మమాసి నచ జన్మభే తథా నైవ జన్మదివసేపి కారయేత్ ।
ఆద్యగర్భదుహితు స్సుతస్యవా జ్యేష్ఠమాసినతు జాతు మంగళమ్ ॥

తా:— జన్మమాసమున, జన్మనక్షత్రమున, జన్మదినమున వివాహముచేయరాదు. ప్రథమగర్భసంభూతు లగు వధూవరులకు జ్యేష్ఠమాసమున వివాహముచేయరాదు.

శ్లో॥ జ్యేష్ఠగర్భప్రసూతాయాః పుత్రికాయా స్సుతస్యచ ।
జ్యేష్ఠమాసేపి కర్తవ్యం యద్యర్కే గవి మంగళమ్ ॥

తా:— జ్యేష్ఠమాసమున సూర్యుడు వృషభరాశియందున్నప్పుడు ప్రథమగర్భసంభూతులైన వధూవరులకు వివాహముచేయవచ్చును.

కాచ నిషేధః

శ్లో॥ వివాహస్య ప్రధానత్వాత్ గళే కాచం ప్రశస్యతే ।
ఇతరాంగేషు సర్వేషు కాచం హి పరిదూష్యతే ॥

తా:— వివాహమునకు ముఖ్యమగుటచే కంఠమున నల్లపూసలు ప్రశస్తమైనవి. ఇతరావయవములయందు గాజులను ధరించరాదు.

ఏకోదరవివాహవిషయః

శ్లో॥ వివాహ స్త్వేకజన్యానాం షణ్మాసాభ్యంతరే యది ।
అసంశయం త్రిభి ర్వర్షై స్తత్రైకా విధవా భవేత్ ॥

తా:- ఏకగర్భజనితుల కిద్దఱకు 6 మాసములలోపల వివాహము చేయరాదు.

శ్లో॥ శుభకృ త్పుత్రి కోద్వాహా త్పశ్చా త్పుత్రకరగ్రహః ।
ఏకతిథ్యామపి ప్రాహ భార్గవో భిన్నవేళయా ॥

తా:- ఒకేతిథియందైనను ముందు కుమార్తె వివాహముచేసి తర్వాత కుమారుని వివాహమును భిన్నవేళలయందు చేయవచ్చునని భార్గవుడు వచించెను.

శ్లో॥ పృథఙ్మంటపయోః కేచి న్నార్యో రేకోదరస్థయోః
ఇచ్ఛంతి భిన్నవేళాయాం తయో రుద్వాహమంగళమ్ ॥

శ్లో॥ ఏకలగ్నేపి భిన్నాంశే వసిష్ఠాత్రిపరాశరాః ।
తయో ర్వివాహ మిచ్ఛంతి పృథ గ్గ్రామేథ మంటపే ॥

తా:- ఏకగర్భజాతలగు కన్యల కిర్వురికి వేరుగ్రామమందుగాని, వేరుమంటపమందుగాని ఏకలగ్నమందైనను భిన్నాంశయందు వివాహము చేయవచ్చునని వసిష్ఠ అత్రి పరాశరులు వచించిరి.

శ్లో॥ మహానదీపర్వతమంతరంవా కృత్వా వివాహం సహజస్య తస్య।
తస్యానుజస్యాపితథైవకార్యంమౌంజీనిబంధాఖ్య మిదం హి శస్తం॥

ఫాల్గునే చైత్రమాసేచ పుత్రోద్వాహోపనాయనే ।
భేదా దబ్దస్య కుర్వీత నర్తుత్రయవిలంఘనం ॥
కుమార్యోస్సుతయోః పుత్రపుత్ర్యో రేకోదరస్థయోః ।
వివాహోద్వాంతరే కర్త స్తయో ర్నద్యంతరే యథా ॥

తా:— ఏకగర్భజనితులగు పురుషులకు వివాహముగాని, ఉపనయనముగాని చేయవలసివచ్చినప్పుడు మహానదిగాని, మహాపర్వతముగాని యడ్డున్నచో 6 మాసము లాగనక్కరలేదు, అట్లే సంవత్సరభేదమున్నను ఆగనక్కరలేదు, ఫాల్గునమాసములో నొకపుత్రునికిని, చైత్రమాసములో నొకకుమారునికిని వివాహముగాని, ఉపనయనముగాని చేయవచ్చును.

శ్లో॥ ఏకస్మిన్ వత్సరే చైకవాసరే మండపేపిచ ।
కర్తవ్యం మంగళం స్వస్రోః భ్రాత్రో ర్యమళజాతయోః ॥
గణశః శ్రీసమానానాం యుగప న్మాతృపూజనం ।
నాందీముఖం భవే దేకం హోమమంత్రాః పృథక్పృథక్ ॥

తా:— కవలలకు ఒకేలగ్నమందు ఉపనయనములుగాని, వివాహములుగాని చేయవచ్చును. మాతృపూజయు నాందీముఖమును ఒక్కటియే చేయవలెను. హోమములు వేరువేరుగా చేయవలెను.

ఆషాఢాదిమాసేషు నూతనవధ్వాః శ్వశురగృహప్రవేశనిషేధః

శ్లో॥ ఉద్వాహా త్ప్రథమే శుచౌ యది వసే ద్భర్తు ర్గృహే కన్యకా ।
హన్యా త్తజ్జననీం క్షయే నిజతనుం జ్యేష్ఠే పతిజ్యేష్ఠకమ్ ॥
పౌషేచ శ్వశురం పతించ మలినే చైత్రే స్వపిత్రాలయే ।
తిష్ఠంతీ పితరంచ హంతి న భయం తేషా మభావే భవేత్ ॥

తా:— వివాహసంవత్సరమున నూతనవధువు అత్తవారింట నాషాఢమాసమున నివసించినచో అత్తగారికి కీడు కలుగును. క్షయమాస

మున నివసించినచో తానే నశించును. జ్యేష్ఠమాసమున బావ నశించును, పుష్యమాసమున మామ నశించును. అధికమాసమున భర్త నశించును, చైత్రమాసమున తనపుట్టినింటనుండినచో తండ్రి మరణించును.

ఆయాసబంధముగలవారు లేనిచో నాయాసమయములయందు దాయాస్థలములలో నివసించినను దోషము లేదు.

తారాబలమ్

శ్లో॥ జన్మనక్షత్ర మారభ్య నిత్యభాంతంచ గణ్యతే ।
నవసంఖ్యాహృం భాగం నవతారాః ప్రకీర్తితాః ॥
జన్మ సంప ద్విపత్ క్షేమ ప్రత్యక్ సాధన నైధనం ।
మిత్రం పరమమైత్రంచ నవతారాః ప్రకీర్తితాః ॥
జన్మభం దేహనాశాయ సంప త్సంపద ఏవచ ॥
విపచ్చ కార్యనాశాయ క్షేమం క్షేమకృతే భవేత్ ।
ప్రత్యక్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే ।
నైధనం నిధనాయ స్యా న్మిత్రంచ సుఖసంపది ॥
పరమమైత్రం సుఖేపి స్యా త్తారాబల మితి క్రమాత్ ॥

తారాదోషాపవాదః

శ్లో॥ జన్మర్క్షే సప్తనాడ్య స్స్యు స్త్రిస్ర స్తు విపదిస్మృతాః ।
ప్రత్యగే నైధనే చాష్టౌ నింద్యా శ్శేషా శ్శుభావహాః ॥
జన్మ త్రి పంచ సప్తాఖ్యా స్తారా నేష్టఫలప్రదాః ।
తద్దోషపరిహారాయ దద్యా దేత ద్ద్విజాతయే ॥
శాకం గుడంచ లవణం సతిలం కాంచనం క్రమాత్ ।
విపది ప్రత్యేగేచైన చరమం చాద్యకంవినా ॥
స్వోచ్చస్వర్గగత శ్చంద్రః శుభద స్సర్వకర్మసు ।

ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేచ తృతీయకం ।
తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషు వర్జయేత్ ॥

శ్లో॥ జన్మర్షం శుభదం నిషేకముఖయో శ్చౌలాన్నభుక్త్యోః కృషౌ
మౌంజీబంధనపట్టబంధనమహీప్రాప్త్యక్షరావాప్తిషు
ఏభ్యోన్యే ష్వశుభప్రదంచ సువనే సీమంతసంగ్రామయో
ర్గర్భాధానపితృక్రియాక్షురభిషగ్యాత్రావివాహే ష్వపి ॥

తా:— జన్మనక్షత్రము నిషేక, యాగ, చౌలకర్మ, అన్నప్రాశన, వ్యవసాయ, ఉపనయన, పట్టాభిషేక, భూసంపాదన, అక్షరాభ్యాసముల యందు శుభకరము, ఇతరకర్మలయందు అనగా పుంసవనము, సీమంతము, యుద్ధము, గర్భాధానము, శ్రాద్ధము, క్షౌరము, ఔషధసేవ, ప్రయాణము వీనియం దశుభప్రదము. స్త్రీలకు వివాహవిషయమై జన్మనక్షత్రము శ్రేష్ఠ మని గ్రంథాంతరమం దీక్రిందివిధమున జెప్పబడియుండుటచే నీవివాహ విషయము పురుషవిషయమని తెలియవలెను.

శ్లో॥ జన్మర్షం జన్మమాసశ్చ తథా జన్మదినం శుభమ్ ।
స్త్రీణాం జన్మత్రయం శ్రేష్ఠః వివాహే సర్వసమ్మతమ్ ॥

## చంద్రబలమ్

శ్లో॥ జన్మాసలబుతౌ సప్త దశమైకాదశే శుభః ।
అద్ధ్యష్టద్వాదశే కృష్ణే శుక్లే ద్వి నవ పంచమే ॥
యథా మాతా సుతాన్ రక్షే త్తథా రక్షతి చంద్రమాః ॥
యాత్రావివాహసీమంత మౌంజీబంధనభుక్తిషు ।
విద్యారంభేచ తారాయాః ప్రధానం బల మిందువత్ ॥

## లగ్నప్రమాణాని

శ్లో॥ మీనమేషౌ చతుర్నాడీ గోకుంభౌ చతురర్ధకం ।
పంచపాదో యుగ్మమృగౌ పంచార్ధం చాపకర్కిణౌ ॥

కార్కిసింహౌచ పంచార్ధం పంచపాద స్తులాంగనే ।
మేషాదీనాం తు లగ్నానాం మాన మేవం విదు ర్బుధాః ॥

ఈ ప్రమాణములు 4 అంగుళములు విషువచ్ఛాయగలదేశములకు సరివచ్చును.

శ్లో॥ వస్వబ్ధిదస్రాః శరశైలపక్షాః
గుణేందురామా గుణదైవతాని
కృశానుదంతాపసుశాగ్నయ స్స్యు
ర్మేషాది ష ఢ్వ్యుత్క్రమతః పరే స్యుః॥

తా:— మేషరాశికి 4.8, వృషభం4-35, మిధునం 5-13, కర్కాటకం 5-33, సింహం5-22, కన్య5-7, తుల5-8, వృశ్చికం5-32. ధనుస్సు 5-33, మకరం5-13, కుంభం 4-25, మీనం4-8. ఇవి 3 అంగుళములు విషువచ్ఛాయగల మద్రాసు, చెంగల్పట్టు, చిత్తూరు, నెల్లూరు దేశములకు పనికివచ్చును.

## లగ్నత్యాజ్యాని

శ్లో॥ అజవృషభధనుఃకన్యకాదౌ భుజంగః
ఝషమకరకుళీరే వృశ్చికాన్తే చ రాహుః
మిధునఘటతులానాం సింహమధ్యేతు గృధ్రః
సకలమునిమతం స్యా త్సర్వకార్యేషు వర్జ్యం ॥

తా:- మేష, వృషభ, ధనుః కన్యాలగ్నములకు మొదట అరగడియ భుజంగ మనువర్జ్యమును; మీన, మకర, కర్కాట, వృశ్చికరాసులకు చివర అరగడియ రాహు వను త్యాజ్యమును; మిథున, కుంభ, తులా. సింహ రాసులకు మధ్య అరగడియ గృధ్ర మనెడి త్యాజ్యమును కలవు. కనుక నాయావేళల శుభకార్యములు జేయరాదు. ఇది సకలఋషి సమ్మతము.

## పుష్కరాంశాః

శ్లో॥ ఏకవింశో మనుశ్చైవ జినాశ్చ మునయః క్రమాత్
మేషాదిమీనపర్యంతం పుష్కరాంశాః ప్రకీర్తితాః ।

తా:- 21, 14, 24, 7, 21, 14, 24, 7. 21, 14, 24, 7 ఈ ప్రకారము మేషము మొదలు మీనముపరకు ఆయాలగ్నములలో నాయా భాగములు పుష్కరాంశలుగా నెరుగునది.

మరియొకరకము

శ్లో॥ మేషద్వయం అష్టతాశం వృషభే ద్వేచ షట్కయోః ।
మిథునే చత్వారి ద్వాదశ్యాం క ర్క్యేకం మునిచంద్రమాః॥
సింహత్రికంచ షట్త్రింశత్ కన్యా ద్వాత్సప్తవింశతిః।
తులా వేదద్వాదశేచ అళీ మేకం మునిశ్చ సః
ధనుత్రికంచ షట్త్రింశత్ మకరే ద్వాత్సప్తవింశతిః।
కుంభ త్రికం చ షట్త్రింశత్ మీనే చపృన్న పుష్కరాః॥

### దృక్సిద్ధ లగ్నఘటికా నిర్ణయః

| | |
|---|---|
| మేషేవార్ధిర్నేత్రబాహుః ४-౨౨ | ఘటశ్వరః పంచనేత్రాః ౫-౨౫ |
| వృషభే పంచ శూన్యకాః ౫-౦ | కీటేపంచపురీగుణాః ౫-౩౩ |
| యుగ్మేబాణే చంద్రబాహుః ౫-౨౭ | ధనుఃపంచగిరీసోమః ౫-౧౭ |
| కర్కిసాయకభూగుణాః ౫-౩౧ | మృగేవార్ధినసాగరాః ४-४० |
| సింహేశరోనందచంద్రః ౫-౧౭ | కుంభేజలధిదిక్పాలాః ४-౮ |
| కన్యాపంచశరేంషపః ౫-౫౧ | మీనేవార్ధికళానిధిః ४-౧ |

దృక్సిద్ధమేషరాశ్యాదిఘటీ విఘటికా స్స్మృతా।

దృక్సిద్ధపుష్కరఘటికానిర్ణయః

| | |
|---|---|
| అజేరామగుణాశ్చైవ ౩-౩ | తౌళ్యాంభూశూన్యబాహూశ్చ ౪-౨౦ |
| వృషేనేత్రనఖాస్తథా ౨-౨౦ | వృశ్చికేభూధృతిస్తథా ౧-౧౮ |
| యుగ్మేవేదాస్త్రీణిబాహూః ౪-౨౩ | ధనూరామద్విపేదాశ్చ ౩-౪౨ |
| కర్కాట్యభూశ్శైలచంద్రయోః ౧-౧౭ | మకరేనేత్రరుద్రయోః ౨-౧౧ |
| సింహేరామగుణావేదాః ౭-౪౩ | కుంభేరామధృతిశ్చైవ ౩-౧౮ |
| కన్యాబాహ్వృషిసంజ్ఞకాః ౨-౨౭ | మీనేశూన్యర్తుసాయకాః ౦-౫౬ |

దృక్సిద్ధమేషరాశ్యాదిపుష్కరాంశాః ప్రకీర్తితాః

పంచకరహితః

శ్లో॥ తిథివారాడుభి ర్యుక్తం తర్కాలోదయమిశ్రితం ।
నవభిస్తు హరే ద్భాగం శేషం పంచక మీరితమ్ ॥

తా:—— తిథి, వార, నక్షత్ర లగ్నములసంఖ్యలను కూడి, 9 చే భాగించినచో 3, 5, 7, 9 మిగిలినట్లైతే పంచకరహితంబని తెలియవలెను, ఇవి మంచివి,

శ్లో॥ ఏకో మృత్యు ర్ద్వయో వహ్ని శ్చత్వారో రాజపంచకం ।
షట్ చోరోష్టరోగ స్స్యా దిత్యేత త్పంచకం స్మృతమ్ ॥

తా:—— 1, 2, 4, 6, 8 మిగిలినచో వరుసగా మృత్యు, వహ్ని, రాజ, చోర, రోగ పంచకము లని పేరు. ఇవి పనికిరానివి.

శ్లో॥ సేవాయాం రాజకం మార్గే చోరం రాజాగ్ని మాలయే ।
మౌంజీబంధన ఉద్వాహే రోగం మృత్యుంచ వర్జయేత్ ॥

తా:—— రాజసేవకు రాజపంచకమును, ప్రయాణమునకు చోర పంచకమును, వాస్తువిషయములో రాజ, అగ్నిపంచకములును, ఉపనయన వివాహములకు రోగ, మృత్యుపంచకములును పనికిరావు.

శ్లో॥ త్యజే ద్భానువారేతు రోగం శనౌ
మృత్యుకం భూమిపుత్రేతు వహ్నిం
గురౌ సోమవారేచ రాజాన మేవం
బుధే, భార్గవే తస్కరాఖ్యం ॥

తా:— ఆదివారమునాడు రోగపంచకమును. శనివారమునాడు మృత్యుపంచమును- మంగళవారమునాడు వహ్నిపంచకమును గురు, సోమవారములందు రాజపంచకమును, బుధ శుక్రవారములయందు చోర పంచకమును వదలవలెను.

శ్లో॥ చోరం రోగం త్యజే ద్రాత్రౌ దివా రాజాగ్ని మేవచ ॥
అర్ధరాత్రే త్యజే న్మృత్యు పంచకం యత్ర దృశ్యతే ॥

తా:- రాత్రియందు చోర, రోగ, పంచకములను, పగలు రాజ, అగ్ని పంచకములను, అర్ధరాత్రమున మృత్యుపంచకమును వదలవలెను. వివాహమునకు యైదుపంచకములలో నే దియు పనికిరా దని పక్షాంతరము కలదు.

2. మాసాదిగా రహితముకానిచో, బహుళపక్షమున సుము హూర్తము నిశ్చయించవలసివచ్చినప్పుడు బహుళపాడ్యమినుండి లెక్క చూడవచ్చును, దానికి పక్షాది యని పేరు.

2. గతతిథి, లగ్నము వీనినిమాత్ర మే లెక్కించి 9 చే భాగించ వచ్చును. దీనిని మార్తాండమత మందురు.

4. మాసాదిగా లెక్కచూచినప్పుడు రహితముకానిచో ఈ క్రింది రీతిగా ధృవకమును కలుపవచ్చును. ధృవకమును కలుపుట కొందరి కభిమతము కాదు.

లగ్నధృవకాని

శ్లో॥ శృతి ర్బాణ యుతుః పంచ వేదత్రీణి ద్వి చంద్రమాః।
ఆకాశేందుద్వయోవహ్నిర్ధ్రువకంచ యథాక్రమమ్ ॥

టీ:. మేషాది మీనపర్యంతము క్రమముగా, 6, 5, 6, 5, 4, 3, 2, 1, 0, 1, 2, 3, సంఖ్యలను కలిపి 9చే భాగించవలెను.

వారదుర్ముహూర్తాని

శ్లో॥ భానౌ మనుః శీతకరేంకసూర్యే
కుజే సముద్రాకృతిః రష్టమోక్షే
గురౌ రసార్కే భృగుజేంకమార్గే।
శనౌ కరేందూ ఖలు దుర్ముహూర్తాః ॥

ఆది 27, 28, ఘ, సోమ 17,18,23,24. మంగళ 7,8,43,44, బుధ 15,16 గురు 11.12,23,24, శుక్ర 7,8,17.18 శని 1,2,3,4, ఇవి వార దుర్ముహూర్తములుగాన వీనియందే శుభకార్యములను చేయరాదు.

నక్షత్రత్యాజ్యాని

శ్లో॥ నైశంవీరనలంనభోభయకరంనీలంనరంఫాలినా
గోనీరంహాయకారినీరభయభోపోనేకభేకంతమః।
వారంనీరనకంనయంహాయతపోవారంనగందస్రతః।
సంఖ్యోర్ధ్వం విషనాడికాహ్యాదధయో లగ్నస్వ్రరోమృత్యుదాః॥

టీ॥ అశ్వని ౫౦ భరణి ౨౪ కృత్తిక ౩౦ రోహిణి ౪౦ మృగశిర ౧౪ ఆర్ద్ర ౨౧ పునర్వసు ౩౦ పుష్యమి ౨౦ ఆశ్రేష ౩౨ మఖ ౩౦ పుబ్బ ౨౦ ఉత్తర ౧౮ హస్త ౨౧ చిత్త ౨౦ స్వాతి ౧౪ విశాఖ ౧౪ అనూరాధ ౧౦ జ్యేష్ఠ ౧౪ మూల ౫౬ పూ.షా ౨౪ ఉ.షా ౨౦ శ్రవణ ౧౦ ధనిష్ఠ ౧౦ శతభిష ౧౮ పూ.భా ౧౬ ఉ.భా ౨౪ రేవతి ౩౦ ఈ నక్షత్రముల కీఘడియలమీద ౪ ఘడియలవరకు త్యాజ్యముండును. ఆ సమయమున నే శుభ కార్యములను చేయరాదు.

వర్జ్యేపి కార్యాణి

శ్లో॥ స్నానే దానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే।
ప్రాయశ్చిత్తే తథా శ్రాద్ధే విషనాడీ ప్రశస్యతే॥

మౌఢ్యవర్జ్యాణి

శ్లో॥ వాపీకూపతటాకయాగగమనక్షౌరప్రతిష్ఠావ్రతం
విద్యామందిరకర్ణవేధనమహాదానం వనస్థాపనం
తీర్థోద్వాహజపాభిషేక మఖిలాన్ దోషప్రయుక్తే తరాన్
దూరేణైవ జిజీవిషుః పరిహరే దార్యేస్తగే వాసితే ॥

మౌఢ్యేపి కార్యాణి

శ్లో॥ భుజంగమూలగ్రహరోగశాంతి ష్వలబ్ధయోగే గ్రహణాభిషేకే ।
దోషప్రయుక్తే ష్వఖిలవ్రతేషు హోత్పాతశాంతౌ నచ మౌఢ్యదోషః॥
మాసప్రయుక్తకార్యేషు మూఢత్వం జీవశుక్రయోః ।
న దోషకృత్తథా కాలలక్షణో బలవానితి ॥
నిత్యయానే గృహే జీర్ణే ప్రాశనాంతేషు సప్తసు ।
వధూప్రవేశే మాంగళ్యే న మౌఢ్యం గురుశుక్రయోః ॥
గోదావర్యాం గయాయాంచ శ్రీశైలే గ్రహణద్వయే ।
అయనే విషువేచైవ చాతుర్మాస్యవ్రతేషుచ॥
నిత్యోత్సవేషు సర్వేషు సీమంతే ఋతుకర్మసు ।
సురాసురేజ్యయోశ్చైవ మూఢదోషో న విద్యతే ॥

మూఢదోషాపవాదః

శ్లో॥ ఏకోమూఢో భవేదన్య స్సోస్వోచ్చమిత్రాంశగో యది ।
స్వరాశిమూర్తిగశ్చైవ మౌఢ్యదోషో న విద్యతే ॥
జీవే లగ్నే బలోపేతే పాపాస్త్రియారిరాశిషు ।
స్థితాశ్చే దస్తశుక్రస్య దోషో నాస్తీతి భార్గవః ॥
గురోరస్తంగతో దోషో నాస్తి శుక్రోదయో యది ।
ద్వయో రస్తమయ స్స్యాచ్చే దపవాదై ర్న విద్యతే ॥

కర్తరీవర్జ్యాని - దైవజ్ఞవిలాసే

1. శ్లో॥ వృక్షచ్ఛేదనపల్కలే కృషిత్సణే బీజంచ భూఘాతనం
గ్రామారంభగృహప్రవేశవనితాసంభోగశయ్యాసనే
క్షౌరారామతటాకకూపశకటాశ్వారోహ దేవాలయాః
సూర్యే వహ్నిభసంయుతేషు దివసేష్వేతాః క్రియాస్సంత్యజేత్॥

2. మాండవ్యః :- దారుకర్మతృణసంగ్రహం తరో
ర్ఛేదనం సదనభిత్తిగోపనం
తత్ప్రవేశ మఖిలక్రియా స్సుధీ
ర్వహ్నిభే దినమణౌ వివర్జయేత్ ॥

3. గ్రామారంభతటాకకూపశకటఛత్రాసనాందోళికా
శయ్యాస్యందనకర్ణకేశఖననం లోష్టాశ్మకర్మాణిచ
గ్రామాగారసురేష్టకాగృహపురగ్రామప్రవేశాదికం
జీవార్థీ దహనర్షగే శశినివా సూర్యే కుజే వర్జయేత్ ॥

4. గార్గిః :- భరణ్యా మస్త్య పాదేచ కృత్తికాయాం పదత్రయే
గృహారంభం న కుర్వీత అగ్నినా దహ్యతే ధృవమ్ ॥

5. యామ్య స్యార్ధం చోత్తరం కృత్తికాయాః
కృత్స్నం బ్రాహ్మ్య పాద అద్య స్తథైవ
సూర్యేతిష్ఠ త్యేషు ధిష్ణ్యేషు నూనం
గేహారంభ స్తత్ప్రవేశోపి వర్జ్యః ॥

నోటు :- 1వ శ్లోకములో బీజావాపమున్నూ, వనితాసంభోగమున్నూ పనికిరాదని చెప్పుటచేత కర్తరిలో గర్భాధానముచేయరాదని యర్థమగుచున్నది. 3వ శ్లోకములో కర్ణకేశఖననం = చెవులుకుట్టుట, కేశఖండనము పనికిరాదని చెప్పుటచేత చౌలోపనయనములును, కేశఖండనయును చేయరాదని వేరుగ చెప్పనక్కరలేదని గ్రహించవలెను.

సూర్యచంద్రపరివేషఫలం

ఇనశశిపరివేషం పూర్వయామేచ పీడా ।
ఇనశశిపరివేషం మధ్యయామే సువృష్టిః ।
ఇనశశిపరివేషం చ త్రియామే సుభిక్షం ।
ఇనశశిపరివేషం చాస్తమానే సువృష్టిః ॥
గురుశశిపరివేషం బ్రాహ్మణానాంచ పీడా ।
కలహ మవనిపుత్రే సూర్యజే వృష్టిపాతః ।
బుధశశిపరివేషం స్త్రీజనానాం వినాశః ।
భృగుశశిపరివేషం సర్వనాశం కరోతి ॥
రవిశశిపరివేషం రాష్ట్రనాశం వసంతే ।
భవతి నృపతియుద్ధం గ్రీష్మగే వృష్టినాశః ॥
జలధరశశిరర్తౌ వారిపూర్ణంచ సౌఖ్యే ।
కుజశనిశశిరాహుసంయుతే దీర్ఘరోగాన్ ॥
పరివేషేచ హేమంతే పశునాశో భవేత్ ధృవం ।
శిశిరోపగమేచైవ చోరాగ్నిజలజం భయం ॥

ఇంద్రధనుఃఫలం

శ్లో॥ అమోఘా దక్షిణా మేఘాః అమోఘా పూర్వవాయవః ।
అమోఘా చోత్తరా విద్యుత్ అమోఘం పశ్చిమం ధనుః ॥
సింహే భిన్నే కుతో వృష్టిః అభిన్నే కర్కటే కుతః ।
కన్యాభిన్నే కదా వృష్టిః తులాభిన్నే సువృష్టికృత్ ॥

సర్వగ్రహాణాం గోచారఫలాని

శ్లో॥ భానుస్స్వాజ్జన్మరాశే స్త్రిదిగరిషు శుభ ష్షట్జన్మత్రికైలే
ష్వింద్రు ర్ద్విజ్నైత్రనాగాద్ద్వ్యరిషు బుధ అగే ష్వాక్షిరత్నేషు జీవః
శుక్రః భాగారివర్జ్య శ్శిఖి ఫణికుజసూర్యాత్మజా ష్షట్త్రిసంస్థా
సర్వే చైకాదశస్థా స్స్యురపి యది శుభా స్తేష్వవేధాస్సురాపాః॥

తా:- జన్మరాశిమొదలు 3,6,10 స్థానములయందు సూర్యుడును, 1,3,6,7,10 స్థానములయందు చంద్రుడును, 10,2,4,8,6 ఈస్థానము యందు బుధుడును, 2,5,7,9 ఈస్థానములయందు బృహస్పతియును, 6,7,10 స్థానములను వదలి మిగతస్థానములయందు శుక్రుడును, 3,6 స్థానములయందు కుజ, శని, రాహు, కేతువులును శుభులు. అన్నిగ్రహము లకు 11 వ స్థానము మంచిది. ఇట్టి శుభస్థానములయం దుండిన గ్రహ ములు పార్శ్వగ్రహవేధారహితములై, సువర్ణరజతమూర్తులైనచో నత్యంత శుభఫలప్రదు లగుదురు. శుభస్థానములయం దున్నను, పార్శ్వగ్రహ వేధలతో కూడియున్నను, లేక తామ్ర లోహ మూర్తులైనను అశుభకరులే యగుదురు.

మూర్తినిర్ణయః

శ్లో॥ జన్మే రసే రుద్ర సువర్ణమూర్తిః
ద్వి పంచ నందా రజత శ్శుభావహః
త్రిస ప్త దిక్ తామ్రధనాగమంచ
వే దార్క మష్టాసుచ లోహ కష్టాః ॥

తా:— గ్రహప్రవేశకాల నక్షత్రరాశి జన్మ రాశికి 1,6,11 స్థాన ములయినచో సువర్ణమూర్తియును, 2,5,9 స్థానములు అయినచో రజత మూర్తియునై శుభముల నిచ్చెదరు. 3,7,10 స్థానములైనచో తామ్ర మూర్తియై ధనమునిచ్చును. 4,8,12 స్థానములైనచో లోహమూర్తియై కష్టములను కలుగజేయును.

వాస్తుపురుష స్థితిక్రమమానం

శ్లో॥ మాసేషు క్రమశ స్త్రిషు సదా ప్రాచీనభస్యాదితః
స్వోపాదేయమహీషు వాస్తుపురుష స్సద్వామశాయీ భవేత్
త్యక్త్వా తచ్చరణే క్షణస్థకకుభౌ తత్పృష్ఠ మూర్ధస్థది
శ్చాలా స్త్వేవ వినిక్షిపే త్తదుపరే శంకుం యథోక్తం సుధీః ॥

తా:– వాస్తుపురుషుడు భాద్రపద, ఆశ్వయుజ, కార్తికమాసముల యందు తూర్పుతలగానున్ను, మార్గశిర, పుష్య, మాఘ మాసములయందు దక్షిణశిరస్సుగానున్ను, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములయందు పడమటితలగానున్ను, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ మాసములయందు ఉత్తర శిరస్సుగానున్నూ యెడమప్రక్కగా నుక్కి శయనించియుండును గాన నతనిపాదము లున్నదిక్కులున్ను, నేత్రములచూపున్న దిక్కు లున్ను వదలి యతనిశిరస్సును, వీపును ఉన్నదిక్కులయందు తా గట్టెడు గృహమునకు మధ్యభాగమున శంఖుస్థాపనము చేయవలెను.

క్షేత్రస్య నవవర్గగణితక్రమః

అవ:- గృహముకట్టెడుస్థలమునకు ధనము, ఋణము, వారము, దినము, నక్షత్రము, ఆయము, ఆయుస్సు, అంశము, దిక్పతు లనెడు నవవర్గగణితక్రమమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆయామేన విశాలమేవ గణయేత్ క్షేత్రీకృతం యత్పదం ।
నాగాద్రైః స్వమృణం భవేత్త్రికరిభి ర్వారో౽ఙ్కశైలైర్దినమ్॥
షట్త్రింశే నభ ముష్టభై ర్నవగజై రాయో౽ఙ్కనాగై ర్వయః
స్త్వంశ ష్షణ్ణవభి స్తదేవ విభజే దాయు ర్గజై ర్దిక్పతిః॥

తా:- గృహముకట్టెడు ప్రదేశముయొక్క నిడువును కొలిచి ఏర్పడినసంఖ్యచే వెడల్పుసంఖ్యను గుణింప నాసంఖ్యక్షేత్రీకృతపదమను నామం బగును. అట్టి క్షేత్రీకృతపదసంఖ్యను ముందు వ్రాయ గల సంఖ్యలచే దొమ్మిదిమారులు గుణించి తొమ్మిదిమారులు భాగహరింపగా మిగిలినసంఖ్యలు ముందుజెప్పిన ధన ఋణాది నవవర్గు లగునట్లు వర్గజ్ఞాపకములకై పైనవ్రాయబోవుసంఖ్యలలో మొదటియంకె గుణకమనియు, రెండవయంకె హారకమనియు దెలియవలెను గుణించువేని నవవర్గగణిత [illegible] గు. [illegible] ధనం౮-౧౮ ఋణ,౯ వారం౩౦దిన,౨౭

౧౯,౮ ౮,౯,౧౨౦ వయస్సు ౬,౯ అంశము మరల వయస్సంఖ్య ౮ చే భాగహరింపగా శేషము దిక్పతి యని యెఱుంగవలయును.

నోటు :- ఈనవవర్గగణితముయొక్క ఫలితములను కాలామృత షష్టబిందువున విపులముగా జూడనగును.

రాత్రౌ స్తంభప్రతిష్ఠా నిషేధః- ఫలగ్రంథే

శ్లో॥ రాత్రౌ స్తంభం న కుర్వీత కర్తా, భార్యా, కులక్షయః ।
పురోహితో విశ్వకర్మా షణ్మాసా న్మరణం ధృవమ్ ॥

గురౌ సింహసంస్థే శుభకార్యవిచారః-ముహూర్తమార్తండే

శ్లో॥ భాగీరథ్యుత్తరే తీరే గోదావర్యాశ్చ దక్షిణే ।
వ్రతోద్వాహాదికర్మాణి సింహసంస్థే న దూష్యతి ॥
గోదావర్యుత్తరే తీరే భాగీరథ్యాశ్చ దక్షిణే ।
వివాహాది న కుర్వీత సింహసంస్థేచ వాక్పతౌ ॥

తా:- గురువు సింహరాశిలోనుండగా గంగకు ఉత్తరమునను, గోదావరికి దక్షిణమునను వివాహోపనయనాదికర్మలు చేయవచ్చును.

గోదావరికి ఉత్తరమునను గంగకు దక్షిణమునను అనగా గంగ గోదావరులమధ్యభాగమున శుభకర్మల నాచరించరాదు. యాత్రలు, ప్రతిష్ఠలు. వాస్తుకర్మలుకూడ మానవలెను.

శ్లో॥ జన్మభా దష్టమే సింహే నీచేవా శత్రుభే గురౌ ।
మౌంజీబంధ శ్శుభః ప్రోక్తః చైత్రే మీనగతే రవౌ ॥

తా:- గురువు సింహములోనున్నను, నీచయందున్నను, శత్రుస్థానమందున్నను, సూర్యుడు మీనరాశిలోనుండగా చైత్రమాసమున నుపనయనము చేయవచ్చును.

శ్లో॥ సింహస్థే దేవగురౌ మేషస్థో యది భవే త్సహస్రాంశుః ।
మంగళకార్యం కుర్యా దితి నారదపరాశరౌవదత ఇతి ॥

తా:- గురువు సింహములో నున్నను సూర్యుడు మేషములో నున్నప్పుడు వివాహము చేయవచ్చును. రజోదోషాది సంకటములు ప్రాప్తించు నను భయము కలిగినప్పుడు బృహస్పతి సింహములోనికి వచ్చినపిమ్మట 9 వ భాగము అనగా 40 రోజులు గడచిన పిమ్మట నెచ్చటనైనను శుభముల చేయవచ్చును.

క్షురకర్మ

శ్లో॥ పుష్యపునర్వసురేవతిహస్తా శ్రవణధనిష్ఠమృగాశ్వని చిత్రా
వాసవవారుణవాయుసమేతం ద్వాదశఋక్షం క్షౌరప్రశస్తం ॥

తా:— పుష్యమి, పునర్వసు, రేపతి, హస్త, శ్రవణము, ధనిష్ఠ, మృగశిర, అశ్వని, చిత్త, జ్యేష్ఠ, శతభిషం, స్వాతి ఈ 12 నక్షత్రములు క్షురకర్మకు మంచివి.

శ్లో॥ మాతు శ్చతుర్థీ భగినీ చతుర్దశీ భ్రాతుశ్చ షష్ఠీ పితురేవ పర్వసు
ఆదౌ నవమ్యాంధనధాన్యనాశం కుటుంబహాని ర్వపనేస చాష్టమీ॥

తా:— చవితి తల్లికిని, చతుర్దశి సోదరికిని, షష్ఠి సోదరునికిని, అమావాస్య, పూర్ణిమ, బహుళఅష్టమి, బహుళచతుర్దశి, సంక్రమణము అను నీ ఐదు పర్వతిథులును తండ్రికిని, పాడ్యమి ధనమునకును, నవమి ధాన్యమునకును, అష్టమి భార్యకును హానికలుగునుగాన నాయాతిథుల యందు క్షురకర్మ చేయించుకొనరాదు.

శ్లో॥ భాను ర్మాసం శని స్సప్త భౌమోష్టౌ నాశయే త్సుఖం ।
వర్ధయేద్వౌ బుధః పంచ మాసాన్ స ప్తనిశాపతిః ॥
శుక్ర స్త్వేకాదశక్షేమం శౌరి వాహాంపతి ర్దశ॥

శ్లో॥ అక్షౌరేపిచ నక్షత్రే కుర్వీత బుధసోమయోః ।
యుక్తేపి తిథినక్షత్రే న కుర్యా చ్ఛనిభౌమయోః ॥

తా:— ఆది, శని, మంగళవారములయందు క్షౌరము చేయించు కొనినచో వరుసగా 1,7,8 నెలలు సుఖము నశించును. బుధ, సోమ, శుక్ర, గురు వారములయందు వరుసగా 5, 7, 11, 10 మాసములు సుఖము వృద్ధియగును. నక్షత్రము పనికిరానిదైనను బుధ సోమ వారములు మంచివి. తిథినక్షత్రములు మంచివైనను శని, మంగళవారములు పనికిరావు.

శ్లో॥ భుక్తో భ్యక్తో వ్రతీ యాత్రారణోద్యోగ్యకృతాహ్నికః
ఉత్కటాభరణో రాత్రౌ సంధ్యయో రుభయో రపి ॥
ప్రాగ్వయా స్స్నాతకో రాజా యోగీన్ద్రో గర్భిణీపతిః ।
శుభేప్సు ర్నవమే చాహ్ని క్షురకర్మ న కారయేత్ ॥

తా:— భుజించినపిమ్మటను, తలంటుకొనినతర్వాతను, వ్రతము నాచరించువాడును, గ్రామాంతరమునకు యుద్ధమునకు వెళ్లువాడును, నగలను ధరించినవాడును రెండుసంధ్యలయందును, రాత్రులందును. సంవత్సరమునకులోపు వయస్సువాడును, రాజు, యోగీశ్వరుడు; గర్భిణీ పతి వీరలు క్షురకర్మ చేసికొనరాదు.

శ్లో॥ రాజకార్యనియుక్తానాం నరాణాం భూపజీవినాం ।
శ్మశ్రులోమనఖచ్ఛేదే నాస్తి కాలవిశోధనమ్ ॥

తా:— రాజులవలన జీవించుచు, రాజకార్యములయందు తిరుగు వారలు మంచిచెడ్డలను విచారించకయే గడ్డము, గోళ్ళు వీటిని చేయించు కొనినను దోషములేదు.

శ్లో॥ షష్ఠ్యమా పూర్ణిమా పాత చతుర్ద శ్యష్టమీ తథా ।
ఆసుసన్నిహితం పాపం తైలేషు స్త్రీభగే క్షురే ॥

తా:— షష్ఠి, అమావాస్య, పూర్ణిమ, వ్యతీపాతయోగము. చతుర్దశి, అష్టమి ఈ తిథులయందు అభ్యంగము, స్త్రీసాంగత్యము, క్షురకర్మ వీని యాచరించినచో పాపము సంభవించును.

శ్లో॥ ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖోవా వపనం కారయే త్సుధీః ॥

తా॥— ఉత్తరముఖముగాగాని, తూర్పుముఖముగాగాని కూర్చొని క్షురకర్మ చేయించుకొనవలెను.

క్షౌరకాలమం దీక్రిందిశ్లోకమును పఠించవలెను

శ్లో॥ ఆనర్తో హి చ్ఛత్రః పాటలీపుత్రో దితి ర్దితిః శ్రీశః ॥
క్షౌరే స్మరణా దేషాం దోషా నశ్యంతి నిశ్శేషాః ॥

జ్వరనక్షత్ర శుభాశుభవివరములు

శ్లో॥ ఉరగశతభిషార్ద్రా స్వాతిమూలా త్రిపూర్వా
భరణిపిత్రువిశాఖా భానుభౌమార్క జానాం
ప్రథమనవమచతుర్థీ అష్టమద్వాదశీవా ॥
హరహరశివయోగే రోగిణాం కాలమృత్యుః॥
అశ్వనీకృత్తికాయోగే జ్వరార్తో నవవాసరః ॥

గ్రంథాంతరే

శ్లో॥ ఉగ్రా శ్చార్పయమత్రిపూర్వవరుణార్ద్రాచైత్ర్యపిత్రానిల
వ్యాళరాశ్చ తథైవ మిత్రరవిపౌష్ణేంద్రాశ్చ సాధారణాః
అశ్వి త్ర్యుత్తరజీవవిష్ణ్వదితిచిత్రాజాగ్నివస్వీందవ
స్సౌమ్యాస్తే ప్రతిప చ్చతుర్థి నవమీ ద్వాదశ్య మాషష్ఠిభిః॥
అర్కార్కిదినైర్యుతా యదిమృతింబహ్వల్పరోగాన్క్రమాత్ ॥

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆర్ద్ర | పు | ఉ | అ | జ్యే | ధ | శ | భ | కృ |
| పున | మ | హ | ని | మూ | శ్ర | పూభా | అ | రో |
| పుష్య | ఆశ్రే | చి | స్వా | పూషా | ఉషా | ఉభా | రే | మృ |

శ్లో॥ ఆర్ద్రాదిచంద్రభాంతంచ మాలా తిష్టతి మధ్యమే ।
రవీందుమస్మభా స్యేకరేఖాయాం చే న్న జీవతి ॥

తా:- ఈ చక్రమునందు వరుసగానున్న తొమ్మిది నక్షత్రములలో జ్వరమువచ్చినరోజు నక్షత్రమున్నూ జన్మనక్షత్రమున్నూ సూర్య సంచార నక్షత్రమున్నూ కలిసియున్నయెడల ఆరోగి మృతుడగునని తాత్పర్యము.

అగ్న్యాదివిహీనస్య యజ్ఞరిపుత్వ మాహ

శ్లో॥ అగ్నిహీన మనావృష్టిః మంత్రహీనంతు ఋత్విజం ।
ఆజ్యహీనం కులం హంతి స్వరహీనంతు పత్నయః ॥
యజ్వానం దక్షిణాహీనం అన్నహీనంతు రాష్ట్రికం ।
సర్వహీనం సదస్యాని నాస్తి యజ్ఞసమో రిపుః ॥
తస్మాత్సర్వప్రయత్నేన కించి ద్ద్రవ్య స్సమాచరేత్ ।
శ్రియః కామ శ్చరే త్సర్వం సమృద్ధం సహ దక్షిణం ॥
అన్నహీనో దహే ద్రాష్ట్రం మంత్రహీన స్త్వృత్విజః ।
దక్షిణాహీనో యజమానం నాస్తి యజ్ఞసమో రిపుః ॥
స్మార్తా న్యన్యాని కుర్వీత శ్రద్ధధానో జితేంద్రియః ।
న త్వల్పదక్షిణై ర్యజ్ఞై ర్యజేత తేహ కథంచన ॥
యత్ఫలం సోమయాగేన ప్రాప్నోతి ధనవాన్ ద్విజః ।
సమ్య క్పంచమహాయజ్ఞైః దరిద్ర స్తదవాప్నుయాత్ ॥
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః ॥
ఏవం ఋషివిధానోక్తం మునీనాం తత్త్వవేదినాం ।
స్వరవేదాహ్నికం హోమం సర్వలోకేషు పూజితం ॥
సర్వలోకేషు పూజిత మిత్యాహ భగవాన్ బోధాయనః ॥

మాసఫలవివేకప్రకారః

శ్లో॥ శుక్లాదివార మారభ్య జన్మభాంతంచ గణ్యతే ।
నవసంఖ్యా హరే చ్ఛేషం మాసే మాసఫలం స్మృతమ్ ॥

తా॥— శుక్లప్రతిపదాదినక్షత్రము మొదలు తన జన్మనక్షత్రమువరకు లెక్కించిన సంఖ్యను ౯ చే భాగించగా మిగిలినసంఖ్య కీ దిగువచెప్పబడెడిఫలములు మాసఫలము లని గ్రహించవలెను.

శ్లో॥ పంథా సుభోజ్యం తనుతాప శౌర్యం
విద్యాచ వస్త్రం విపులంచ శోకమ్
అనంతపుణ్యంచ మహాఫలంచ
నవేతి మాసస్య ఫలాని చాహుః ॥

తా:— (౧) మిగిలిన ప్రయాణము. (౨) మిగిలిన సుభోజ్యము. (౩) మిగిలిన శరీరతాపము. (౪) శౌర్యము, (౫) విద్యాలాభము. (౬) వస్త్రలాభము, (౭) తీవ్రదుఃఖము, (౮) అనంతపుణ్యము. (౯) మహాఫలప్రాప్తి - ఈవిధముగా నెఱుంగవలెను.

అఖండతిథినక్షత్రనిర్ణయః

శ్లో॥ సంపూర్ణా యది తారకాశ్చ తిథయ స్స్యుస్తా అఖండాభిధా
అప్యర్కోదయసంయుతా న శుభదా స్సర్వవ్రతానా మపి
యద్వార్కోదయగా ఇనాస్తసహితా స్తా అ ప్యఖండాః పరే
ప్రాహు ర్వ్యా పినఖండ మ ప్యతిగతా స్తా అ ప్యఖండా ఇతి॥

దైవజ్ఞవిలాసే - సత్యవ్రతః

శ్లో॥ ఉదయస్థా తిథి ర్యాహి న భవే ద్దిన మధ్యగా ।
సా ఖండా న ప్రధానా స్యాత్ వ్రతారంభే సమాపనే ॥

వ్యా:- అఖండతిథినక్షత్రే ష్వేవ ప్రారంభం వ్రతోద్యాపనం చ కర్తవ్య మిత్యాశయః। వ్రతాంతే తు నాయం నియమః । స్వకాలే బలవత్వాత్॥

తా:- సూర్యోదయము మొదలు మఱునాడు సూర్యోదయమువరకు వ్యాపించియున్న తిథి నక్షత్రంబులును, సూర్యోదయము మొదల స్తమయ

వరకు వ్యాపించియున్న తిథినక్షత్రంబులును, కొందరిమతంబున సూర్యో దయమును మొదలు మధ్యాహ్నకాలమువరకు నున్న తిథినక్షత్రంబులును అఖండంబులనియు - ఇవి ప్రవారంభవ్రతోద్యాపనములకు యోగ్యంబులనియు - సూర్యోదయమందుమాత్ర మున్న తిథినక్షత్రములు సర్వవ్రతములకు నయోగ్యంబులనియు - వ్రతసమాప్తి కీ నియమము లేదనియు భావము.

### వ్రతారంభాదౌ మూఢాదిదోషః

శ్లో॥ అస్తగేచ గురౌ శుక్రే బాల్యే వృద్ధౌ మలిమ్లుచే ।
ఉద్యాపన ముపారంభం వ్రతనాం నైవ కారయేత్ ॥
అగ్న్యాధానం ప్రతిష్ఠాచ యజ్ఞదానవ్రతానిచ ।
మాంగళ్య మభిషేకంచ మలమాసే వివర్జయేత్ ॥

తా।- వ్రతారంభము, ఉద్యాపనము, అగ్న్యాధానము, ప్రతిష్ఠ యజ్ఞము, దానము మున్నగు శుభములను గురుశుక్రులమూఢమియందును, అధికమాసమందును చేయరాదు.

### స్థాలీపాక తిథినిర్ణయః

శ్లో॥ ప్రతిప త్పర్వనాడ్యస్తు మిళి త్వాహః ప్రమాణతః ।
అధికాశ్చే త్పరేహ్ని స్యాత్ సమా న్యూనాశ్చ తద్దినే ॥

తా:-పాడ్యమి, పర్వ రెండుఘోజులఘడియలను కలిపినచో అహః ప్రమాణముకంటె నధికమైనచో పరదినము స్థాలీపాక మగును. సమానమైనను, తక్కువైనను పర్వనాడే యగును.

### ఆబ్దిక తిథినిర్ణయః

అహః ప్రమాణఘటికలను విఘటికలతోగూడ సమంబుగ నైదు భాగములు చేయగా నవి క్రమముగా ప్రాత, స్సంగమ, మధ్యాహ్న, అపరాహ్ణ, సాయంకాలము లనబడును. ఒకతిథి రెండుదినముల యపరాహ్ణ

ములయందు వ్యాపించియున్నపు డెద్ది యపరాహ్ణమం దధికముగనుండునో ఆతిథియందును, రెండపరాహ్ణములయందును సమముగా నుండెనేని పూర్వ తిథియందును, ఒక యపరాహ్ణమందైనను వ్యాపించక, పూర్వదినంబున సూర్యాస్తమయమునకుముందు ౬ గడియలు వ్యాపించియుండెనేనియు, పూర్వతిథియందును అట్లులేకయున్నప్పుడును, రెండుసాయంకాలములయం దొకతిథి వ్యాపించియున్నప్పుడును, పరతిథియందును, ప్రతిసాంవత్సరిక, దర్శశ్రాద్ధ, మాసికముల జేయవలయును. రెండపరాహ్ణములయందు సమముగానున్నయెడల తిథిక్షయకాలమందు పూర్వతిథియు, వృద్ధి, సమ, కాలములయందు పరతిథియును గ్రాహ్యంబులు.

ఏకాదశీ నిర్ణయః

శ్లో॥ అరుణోదయవేధో ఽత్ర వేధః సూర్యోదయే తథా।
ఉక్తౌ ద్వౌ దశమీ వేధౌ వైష్ణవస్మార్తయోః క్రమాత్॥

తా:- వైష్ణవుల కరుణోదయమునకు దశమీవేధయున్నను, స్మార్తులకు సూర్యోదయమునకు దశమీవేధయున్నను అట్టి యేకాదశి పనికిరానిది.

భృగుః:- సంపూర్ణైకాదశీ యత్ర ప్రభాతే పున రేవ సా।
తత్రోపోష్యా ద్వితీయాతు పరతో ద్వాదశీ యది॥

తా:- ఏకాదశి పూర్తిగానుండి, మరునాడుదయమునగూడా ఏకాదశి మిగులుండి, త్రయోదశినా డుదయమున ద్వాదశి మిగు లున్నచో, ఏకాదశి మిగులునాకే ఉపవాసముండవలెను.

వ్యాఘ్రపాదః

శ్లో॥ ప్రథమే ఽహని సంపూర్ణా యా స్యా దేకాదశీ యది।
ద్వాదశ్యాంచ యదా తావత్ దృశ్యతే పునరేవ సా॥

త్రయోదశ్యాం క్రియ న్మాత్రా ద్వాదశీ న లభే ద్యది।
పూర్వా. కార్యా గృహస్థైస్తు యతిభి శ్చోత్తరా సదా॥

తా:- మొదటిరోజున పూర్తిగా ఏకాదశి యుండి, మరునాడుకూడా మిగు లుండి, త్రయోదశినాడు ద్వాదశి మిగు లుండదనిన్నో, మొదటిరోజున గృహస్థులును, రెండవనాడు యతులును ఉపవసించవలెను.

వైష్ణవైకాదశీ నిర్ణయః

శ్లో॥ దశమీ శేషసంయుక్తా యది స్యా దరుణోదయః।
నైవోపోష్యం వైష్ణవేన తద్దినే కాదశీవ్రతమ్॥

తా:- అరుణోదయకాలమునకు అనగా తెల్లవారుజామున 57 గడియలకు దశమియున్నచో నట్టిరోజున శ్రీవైష్ణవు లుపవసించరాదు.

శ్లో॥ ఏకాదశీ ద్వాదశీవా ధికా చేత్ త్యాజ్యతాం దినమ్।
పూర్వం గ్రాహ్యం తూత్తరంస్యా దితి వైష్ణవనిర్ణయః॥

తా:- ఏకాదశి వృద్ధిలోనున్నను, ద్వాదశి వృద్ధిలోనున్నను లేక రెండును వృద్ధిలోనున్నను వైష్ణవులు పూర్వమును విడచి, పరమును గ్రహింపవలెను.

శ్లో॥ సంపూర్ణైకాదశీ త్యాజ్యా పరతో ద్వాదశీ యది।
ఉపోష్యా ద్వాదశీ శుద్ధా ద్వాదశ్యామేవ పారణమ్॥

తా:- ఏకాదశి పూర్తిగానుండి, మరునాడు ద్వాదశికూడా పూర్తిగా నుండి, మూడవనాడు ద్వాదశి మిగులున్నచో, ఏకాదశినివదలి ద్వాదశినా డుపవసించి, ద్వాదశిమిగులునాడు పారణచేయవలెను.

పాద్మే:- వివాదేషుచ సర్వేషు ద్వాదశ్యాం సముపోషణమ్।
పారణంచ త్రయోదశ్యాం ఆజ్ఞేయం మామకీ మునే॥

తా:- మతభేదములు కలిగినప్పుడు ద్వాదశినా డుపవసించి, త్రయో దశినాడు పారణము చేయవలె నని భగవానునియాజ్ఞ.

శ్లో॥ సంపూర్ణైకాదశీ యత్ర ద్వాదశీ వృద్ధిగామినీ

ద్వాదశ్యా ముపవ స్తవ్యః త్రయోదశ్యాంతు పారణమ్॥

తా:- ఏకాదశి పూర్తిగా నుండి, మరునాడు ద్వాదశి వృద్ధిలో నున్నచో ద్వాదశినా డుపవసించి, త్రయోదశినాడు పారణచేయవలెను.

సంక్రాంతిపుణ్యకాలనిర్ణయః

శ్లో॥ త్రింశత్కర్కటకేతు పూర్వ మయనే నాడ్యః పరే వింశతిః

దైత్యార్యంఘ్రిషు నాడికా నృపమితా మేషే తులాయాం దశ

షష్టిశ్చైవ పరేషు పుణ్యఫలదాః స్నానంచ దానం పితుః।

శ్రాద్ధం కార్య మినాబ్జయో గ్గ్రహణయో స్తద్వత్పితృప్రీతిదమ్॥

రాత్రౌ మకరసంక్రమణే ప్రాప్తే - హేమాద్రౌ

శ్లో॥ త్రింశత్కర్కటకే నాడ్యో మకరేతు దశాధికాః।

తా ఏవ దక్షిణే పూర్వ మతీతే చోత్తరాయణే॥

అస్తాత్ప్రాక్ సంక్రమే వర్కే తదహః పుణ్య మాచరేత్।

ప్రదోషే వార్ధరాత్రౌవా స్నానం దానం పరే హని॥

తా:- కటకసంక్రమణమునకు పూర్వము 30 ఘడియలును, మకర సంక్రమణము ప[illegible]యందైన తదనంతరంబున 20 ఘడియలును, రాత్రి యందైన 40 ఘడియలును, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ,సంక్రాంతు ల[illegible] విష్ణుపదపుణ్యకాలములకు పూర్వమున ౧౬ ఘడియలును, మేష, తులా సంక్రమణములకు పూర్వమున ౫ ఘడియలును, పరమున ౫ ఘడి యలును, మిధున, కన్యా, ధను, మీనము లనెడి షడశీతిపుణ్యకాలములకు పూర్వమున 30 ఘడియలును పరమున 30 ఘడియలును, పుణ్యఫలప్రదం

ములుగాన. నీపుణ్యకాలములయందును. సూర్యచంద్రగ్రహణకాలమ్ము యందును. స్నాన దాన పితృశ్రాద్ధాదు లావశ్యకంబుగ జేయవలయును.

యాత్రాప్రకరణము

శ్లో॥ నందాభిధానా స్తిథయశ్చ పూర్వే భద్రాయ భద్రాః కథితా యమేచ।
జయా జయార్థం యది పశ్చిమేచ పూర్ణా ఉదీచ్యాం నగతంతు రిక్తే॥

తా:- నంద, భద్ర, జయ, పూర్ణ తిథులు వరుసగా దక్షిణ, పడమర, ఉత్తరదిక్కులకు ప్రయాణమైవెళ్ళుటకు మంచివి. రిక్తతిథులనాడు ప్రయాణముచేయరాదు.

తిథిశూలలు

శ్లో॥ ప్రతిప న్నవమీ పూర్వే ద్వితీయా దశ చోత్తరే।
తృతీ యైకాదశీ చాగ్నౌ చతు ర్ద్వాదశ నైరృతౌ ॥
పంచత్రయోదశీ యామ్యే జలే షష్ఠీ త్రయోశీ।
సప్తమీ పూర్ణిమా వాయౌ వమావా స్యాష్టమీ శివే ॥

తా:- ౧, ౯ తూర్పు, ౨,౧౦. ఉత్తరము, ౩, ౧౧ ఆగ్నేయము, ౪, ౧౨ నైరృతి, ౫, ౧౩, దక్షిణము. ౬, ౧౩, పడమర. ౭,౧౫ వాయవ్యము, ౩౦, ౮ ఈశాన్యము అను దిక్కులకు శూలలుగాన ఆయాతిథులనాడు ప్రయాణముచేయరాదు.

వారశూలలు

శ్లో॥ న పూర్వే శనిసోమౌచ న గురు ర్దక్షిణే తథా।
న పశ్చా ద్భానుశుక్రౌచ నోత్తరే బుధమంగళౌ ॥
శని ర్గురు శ్చా ప్యాగ్నేయే సోమశుక్రౌ చ నైరృతౌ।
కుజాదిత్యౌచ వాయవ్యే బుధ ఈశాన్య మేవచ ॥

తా:- శని, సోమ వారములు తూర్పునకును, గురువారము దక్షిణమునకును ఆది శుక్రవారములు పడమరకును, బుధ, మంగళ వారము

శ్లో॥ ఇంద్రే దధి యమే తైలం వారుణే గుడమేవచ ।
ఉత్తరే క్షీర మాజ్యంచ వారదోషా న విద్యతే ॥

తా:- తూర్పునకు పెరుగును, దక్షిణమునకు నువ్వులనూనె, పడమర బెల్లమును, ఉత్తరము పాలును, నేయియు దానముచేసిన దోషము లుండవు.

తిథివిశేషములు

శ్లో॥ ద్వితీయాచ తృతీయాచ పంచమీ సప్తమి తథా।
దశమ్యేకాదశీచైవ యాత్రాసిద్ధిం త్రయోదశీ॥

శ్లో॥ కృష్ణేవా యదివా శుక్లే వర్జనీయా చతుర్దశీ।
పౌర్ణమాస్యా మమాయాంచ న గంతవ్యం కదాచన॥

ప్రయాణయోగ్య నక్షత్రములు

శ్లో॥ మృగాశ్వనీపుష్యపునర్వసూచ హస్తానురాధాశ్రవణాని మూలా
ధనిష్ఠరేవ త్యఖిలే ప్రయాణే ఫలం లభే చ్ఛ్రమనివర్తనంచ॥

తా:- మృగశిర, అశ్వని, పుష్యమి, పునర్వసు, హస్త, అనూరాధ, శ్రవణము, మూల, ధనిష్ఠ, రేవతి ఇవి ప్రయాణయోగ్య నక్షత్రములు

ప్రయాణమునకు పనికిరాని నక్షత్రములు

శ్లో॥ త్రీణిపుబ్బా మఖా జ్యేష్ఠా భరణీ జన్మ కృత్తికా।
స్వాతీ సార్ప విశా ఖార్ద్రా చిత్రా గమనవర్జయేత్॥

తా:- పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మఖ, జ్యేష్ఠ, భరణి జన్మనక్షత్రము, కృత్తిక, స్వాతి, ఆశ్లేష, విశాఖ, ఆర్ద్ర, చిత్త ఇవి కూడని నక్షత్రములు.

### నక్షత్రశూలలు

శ్లో॥ పూర్వే జ్యేష్ఠధనిష్ఠేచ శ్రవణాశ్వని దక్షిణే।
పశ్చిమే పుష్యరోహిణ్యౌ హస్తా ఫల్గుని చోత్తరే॥
ఏతన్నక్షత్రశూలాఖ్యం న యాత్రా పునరాగమః॥

తా:- తూర్పునకు జ్యేష్ఠధనిష్ఠలును, దక్షిణమునకు శ్రవణము అశ్వనియు, పడమరకు పుష్యమి రోహిణియు, ఉత్తరముకు హస్త పుబ్బ నక్షత్రములును పనికిరానివి.

### ప్రయాణ లగ్నములు

శ్లో॥ చరే లగ్నేచ గంతవ్యం ద్విస్వభావే సదా నృపైః।
లగ్నే స్థిరే న గంతవ్యం యాత్రాయాం క్షేమ మిచ్ఛతా॥

తా:- చరలగ్నమున ప్రయాణము చేయవలెను. రాజులకు ద్విస్వభావలగ్నము మంచిది. స్థిరలగ్న మెవరికిని మంచిదికాదు.

### పురశ్శుక్రదోషము

వ:- నూతనవధువు, గర్భిణీస్త్రీ, పసిపిల్లతల్లి శుక్రుడు తూర్పు దిక్కుననున్నప్పుడు పశ్చిమమునుండి వాయవ్య, ఉత్తర, ఈశాన్య, తూర్పు దిక్కులకు ప్రయాణము చేయరాదు. పశ్చిమమున నున్నప్పుడు తూర్పునుండి ఆగ్నేయ, దక్షిణ, నైఋతి, పశ్చిమదిక్కులకు వెళ్ళరాదు.

ఏకగ్రామమునందును, దుర్భిక్షమునందును, రాజవిద్వరమందును, వివాహమునకును, తీర్థయాత్రలకును పోవునపుడు పురశ్శుక్రదోషములేదు, భారద్వాజ, ఆంగీరస, భృగు, అత్రి, కాశ్యప, వాసిష్ఠ గోత్రములవారికి పురశ్శుక్రదోషము లేదు.

### గ్రామార్వణం

గ్రామనక్షత్రము మొదలు, యజమానినక్షత్రమువరకు లెక్కించగా మొదటి 5 ఫలం ధనలాభం, తదాది 3 ధననాశనం, తదాది 5 ధనవృద్ధి,

8 దారిద్ర్యము, తదాది 1 ప్రాణహాని, తదాది 4 సంపత్తు, తదాది 1 ధన వ్యయం, తదాది 1 ధననాశనం అని ఫలముల నెరుగవలెను.

## భృత్యార్వణము

సేవకునివిషయమై అర్వణముచూచునపుడు ప్రభునామనక్షత్రము మొదలు సేవకునినామనక్షత్రమువరకు లెక్కించి ఆ సంఖ్యను 4 చే గుణించి, 7 చే భాగించగా శేషము ధనమగును. తిరిగి సేవకుని నామ నక్షత్రముమొదలు ప్రభునామనక్షత్రమువరకు లెక్కించి ఆ సంఖ్యను 4 చే గుణించి 7 చే భాగించగా శేషము ఋణ మగును. ధనమధికమైన శుభము- ఋణ మధికమైన అశుభము.

## నిర్గమనలక్షణ మాహ - కాలామృతే

శ్లో॥ తల్లగ్నే గమనం నవే న్నరపతిః ఖడ్గాదిసంచాలయే
న్మిత్రైర్మిత్రగృహం పితృగ్రహసురాన్ సంపూజ్య తద్దిక్పతిం
ఏతన్నిర్గమనం త్రిరాత్ర మవధిః పశ్చాద్వ్రజే న్మంగలైః
విప్రాది ర్వసుతండులాన్యపి నయే త్స్యా త్పంచరాత్రావధి॥

తా:- తారాబల, చంద్రబల యుక్తముగా లగ్నమును స్థిరపరచుకొని యాలగ్నమున ప్రయాణము సాగనిచో క్షత్రియుడు పితృదేవతలను, నవగ్రహాలను, దేవతలను తాను ప్రయాణమైన దిగధిపతిని పూజించి, మిత్రులతో కూడుకొని, ఛత్ర చామర ఖడ్గాదులను తీసికొని, బంధుగృహమున వానిని స్థాపించి, 3 రోజులపిమ్మట మంగళ వాయిద్యములతో ప్రయాణము చేయవలెను.

బ్రాహ్మణులు ద్రవ్యమును, వైశ్యులు బియ్యమును, శూద్రులు వస్త్రములును నిర్గమనముగానుంచి 5 రోజులలోపల ప్రయాణము చేయవలెను. 5 రోజులు దాటిన పనికిరాదు.

## అథ సూర్యచంద్రనాడీవివేక మాహ

శ్లో॥ నాసాదక్షిణభాగజాతపవన స్సూర్యాఖ్యనాడీ శుభా
సంగ్రామవ్యవహారమైథునభయస్నానాన్నభంగా త్రిషు
నా ద్యన్యా శశిన శ్శుభైవ గమనాలంకారపాణిగ్రహ
క్షేత్రాద్యేషు యదంశవాయుచలనే తత్పాదపూర్వం ప్రజేత్ ॥

తా:- నాసికమునకు కుడిప్రక్కనున్న రంధ్రమునందు సంచరించుచున్నవాయువు సూర్యనాడి యనియు, ఈ సూర్యనాడి యుద్ధము, క్రయవిక్రయాదివ్యాపారము, మైథునము, రాజభయము, మంగళస్నానము, భోజనకాలము, పరాజయము, మనఃపీడ ఇవి మొదలగుకార్యముల విషయమై శుభకరంబనియును; నాసికమున ఎడమప్రక్కనున్న రంధ్రమందు సంచరించువాయువు చంద్రనాడి యనియు, ఆనాడి భూషణధారణము, వివాహము, వ్యవసాయము మొదలగు కార్యములవిషయమై శుభకరంబనియు, నాసికమున కేభాగమునం దేవాయువు సంచరించుచుండునో ఆ భాగపాదసంచారము ముందుగా జేయవలయుననియు భావము.

## శిక్కాదిషు కర్తవ్యవిధిః

శ్లో॥ శిక్కాపతనజృంభాసు, జీవో త్తిష్ఠాంగుళిధ్వనిమ్ ।
కుర్వన్ శ్రేయో హ్యవాప్నోతి అకృత్వా బ్రహ్మహా భవేత్ ॥

తా:- ఇతరుడు తుమ్మినపుడు "చిరంజీవి" యనియు, పడినపుడు "లెమ్ము" అనియు, అనవలెను. ఆవులించినపుడు చిటికెలు వేయవలెను, అట్లు చేయనిచో దోషముకలుగును.

## గండపురుషస్థితిఫలాని

శ్లో॥ వ్యోమే తిష్ఠతి మాఘఫాల్గుణనభో పై శాఖమాసేషు చే
త్పాతాళే వస తీషభాద్రపదచైత్రోర్జేషు మాసేషుచ

మర్త్యే తిష్ఠతి పౌషమార్గశుచి శుక్రాజ్యేషుమాసేషుచే
త్పాతాళే సుఖ మంబరేచ విజయం మర్త్యే మృతి స్స్యాత్ఫలమ్॥

తా:- గండపురుషుడు కార్తీక, ఆషాఢ, ఫాల్గుణ, వైశాఖ మాసములయందు ఆకాశమునను, మాఘ, భాద్రపద, చైత్ర, ఆశ్వయుజమాసములలో పాతాళమునను, జ్యేష్ఠ, శ్రావణ, మార్గశిర, పుష్య మాసములలో భూమియందును ఉండును.

గండపురుషుడు భూమియందున్నకాలమున రజస్వలా. ప్రసూతి మొదలగునవి సంభవించెనేని దోష మధికమగుటచే విశేషశాంతి చేసికొనవలెను. పాతాళమునందున్నప్పుడు సుఖమును, ఆకసమున. నున్నప్పుడు విజయమును కలుగును.

ప్రథమర్తౌ శుభనక్షత్రాణి

శ్లో॥ కరాదిపంచోత్తరమూలపౌష్ణ
విష్ణుత్రయాశ్వ్యజ్య విధీందుభేషు
ఆద్యం రజ స్సౌఖ్యసుతాయు రర్థా
సౌభాగ్యవృద్ధిం కురు తేంగనానామ్

తా:- హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ఉత్తర, మూల, రేవతి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, అశ్విని, పుష్యమి, రోహిణి, మృగశిర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ 17 నక్షత్రములును, సోమ, బుధ, గురు, శుక్రవారములును ప్రథమరజస్వలకు మంచివి.

ప్రథమర్తౌ దుష్టనక్షత్రాణి

శ్లో॥ త్రిపూర్వాహి యమాగ్నేయం మఘాజ్యేష్ఠాది మార్తవే,
పునర్వసూ తథార్ద్రాచ శాన్త్యర్హాణి వినిర్దిశేత్॥

తా:- పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఆశ్లేష, భరణి, కృత్తిక, మఘ, జ్యేష్ఠ, పునర్వసు, ఆర్ద్ర ఈ పదియును శాంతినక్షత్రములు.

అత్ర విశేషః

శ్లో॥ భరణ్యాం దశమాసాస్తు త్రిపూర్వా స్వష్టమాసకాః
మఘాయాం ద్వాదశ ప్రోక్తాః షణ్మాసా రౌద్రభే తథా॥
ఆశ్లేషా కృత్తి కేంద్రేషు చతుర్మాసాః ప్రకీర్తితాః
పునర్వసౌ పంచమాసాః త్యాజ్యా స్యు ర్భర్తృదర్శనే ॥

వా:- భర్తృదర్శనంనామ ఋతుసమావేశ ఇతికేషాంచి న్మతమ్ ॥

తా:: పై దుష్టనక్షత్రములయందు ప్రథమరజస్వలయైనచో ద్వితీయ రజస్వలకాకపూర్వమే శాంతిచేసికొని, భరణికి 10 మాసములును, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలకు 8మాసములును, మఘకు 12 మాసములును, ఆర్ద్రకు 6 మాసములును, ఆశ్లేష, కృత్తిక, జ్యేష్ఠలకు 4 మాసములును, పునర్వసుకు 5 మాసములును గడిచినపిమ్మట గర్భాధానముచేసికొనవలెను,

జననె దుష్టనక్షత్రాణి

శ్లో॥ అశ్విన్యాదిచతుష్కంచ పుష్యప్రభృతిపంచకం ।
రాధేంద్రభాదిత్రితయం పూర్వాభాద్రాచ రేవతీ ॥
చిత్రార్ద్రా బహుదోషా స్స్యుః పితృమాతృవినాశకాః ।
సూతౌ సప్తదశైతాని శాన్త్యర్హాణి వినిర్దిశేత్ ॥

అత్ర పాదభేద మాహ

శ్లో॥ అశ్వ్యాద్యాహుతాశనార్యమహరబ్రహ్మాఖ్యభేష్వాద్యప త్పుష్యే ద్వ్యంఘ్రి భుజంగ మేఖల భగ త్వాష్ట్ర ద్విదైవత్యభే ష్వింద్రే చాంత్యపదం ప్రసూతిసమయే నింద్యాని పై పర్వదా పూర్వాభాద్రజలాసురాంత్యజననే కార్యా సుశాంతి ర్జనైః॥

తా:- అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, అనూరాధ, జ్యేష్ఠ మూల, పూర్వాషాఢ. పూర్వాభాద్ర, రేవతి, చిత్త, ఆర్ద్ర ఈ 17 ను జననమునకు శాంతినక్షత్రములు.

పాదభేదమును చెప్పుచున్నాడు

అశ్వని, భరణి, కృత్తిక, ఉత్తర, ఆర్ద్ర, రోహిణి వీటియందు మొదటిపాదమును, పుష్యమి 2 పాదమును, ఆశ్లేష, మఘ, పూర్వ ఫల్గుని, చిత్త విశాఖ, జ్యేష్ఠ, వీటి 4 వ పాదమును, పూర్వాభాద్ర, పూర్వాషాఢ, మూల, రేవతి ఈనక్షత్రములయందును జన్మించినవారికి యథావిధిగ శాంతి నాచరించవలెను.

నోటు:- గ్రహణకాలే రజస్స్వలాప్రసవయో శ్శాంతివిధిః ధర్మసింధౌ ద్రష్టవ్యః॥

ఏకనక్షత్రజననశాంతిః

శ్లో॥ కస్మిన్నేవ నక్షత్రే భ్రాత్రోర్వా పితృపుత్రయోః।
పరిసూతి శ్చేత్తయో ర్మృత్యుః భవే దేకస్య నిశ్చయః॥

నాళవేష్టనశాంతిః

శ్లో॥ నాళవేష్టనజాతస్య పితు ర్భ్రాతుశ్చ మాతులః।
ఉపవీతాకృతి స్సవ్యా అపసవ్యంచ మాలికా॥
పితాదీనాం దోషయుతం మాతులస్య విశేషతః।
తద్దోషశమనార్థాయ శాంతిం కుర్యా ద్యథావిధి॥

నోటు:- ఏకనక్షత్రజనన నాళవేష్టన శాంతి విధులను శాంతి కమలాకరమునను, ప్రయోగమును యాజుషప్రయోగ చింతామణియందును విపులముగా చూడనగును.

తల్లిదండ్రులయొక్క గాని, సోదరసోదరీలయొక్క గాని జన్మరాశియందేకపాదమున శిశువు జన్మించినచో యథావిధి శాంతిచేసికొనవలె నని ఫలప్రదర్శినియందు గలదు. భిన్నపాదమైనచో దోషము లేదు.

ప్రసూతి గండాని

శ్లో॥ ఉత్తరే ప్రథమే పాదే పుష్యే చైవ తు మధ్యమే (ద్వితీయకే)।
పూర్వాషాఢ త్రిపాదేచ చిత్రార్థం పూర్వమేవచ॥

ఏష జాతకుమార స్స్యాత్ పితరం హంతి నిశ్చయః।
జ్యేష్ఠాదౌ జననీ మాతా ద్వితీయే జననీ పితా॥
తృతీయే జననీ భ్రాతా స్వయం మాతా చతుర్థకే।
పంచమీ ఆత్మజం హంతి షష్ఠే గోత్రక్షయం భవేత్।
సప్తమీ కులనాశాయ అష్టమం జ్యేష్ఠభ్రాతరం।
నవమం శ్వశురం హంతి సర్వం హంతి దశా భవేత్॥
మూలా ద్వాదశగండాని ఘటికా బాణసంఖ్యయా।
పితృమాతృసహోదర్యా భగినీ శ్వశుర మేవచ॥
పితృభగినీ మాతులానాం అర్థనాశంచ జీవతి।
జీవనాశం దరిద్రంచ రాజా సంపద మేవచ॥
మూలాదౌ పితృగండం స్యాత్ ద్వితీయే మాతృగండకం।
తృతీయే ధనగండం స్యాత్ చతుర్థేచ శుభావహం॥
కృష్ణపక్షే చతుర్దశ్యాం ప్రసూతిఫల ముచ్యతే।
సా తిథిశ్చైవ షడ్భాగే ప్రథమేచ న దోషభాక్॥
ద్వితీయే పితరం హంతి తృతీయే మాతరం తథా।
చతుర్థే మాతులం హంతి పంచమే వంశనాశనం॥
షష్ఠేచ శిశుగండం స్యాత్ ఏత ద్గండస్య లక్షణం।
అమాయా షష్ఠభాగేషు దోష స్స్యాత్ ఫల ముచ్యతే॥
ప్రథమే పితరం హంతి ద్వితీయే మాతరం తథా।
తృతీయే మాతులం హంతి చతుర్థే భ్రాతరం తథా॥
పంచమే ఆత్మజం హంతి షష్ఠే దోషో న విద్యతే।
సినీవాలీ ప్రసూతాచ యస్య భార్యా పశు స్తథా॥
గవాశ్వమహిషాదీనాం పరిత్యాగో విధీయతే।
ఆశ్రేషా పితృగండం స్యాత్ ద్వితీయే మాతురేవచ ॥

తృతీయే ధనగండం స్యాత్ చతుర్థేచ శుభావహం ।
శీర్షే పంచ శుభప్రాప్తి ముఖే సప్త పితా హరేత్ ॥
నేత్రే ద్వే జననీ మాతా పరివార త్రికంటకః ।
స్కంధేషు దుశివాభక్త్యా బాహోర్వష్ట మబలి ర్భవేత్ ।
అథ ఏకాదశం ప్రోక్తం ఆత్మభా త్స భవే న్నరః ।
నాభే షట్ ధనత్యాగీ గుహ్యే నవ తపోధనః ॥
పాదౌ పంచ ధనం హంతి ఆశ్రేషాచ యథాఫలం ॥

వర్జ్యమునకు

విషనాడీషు సంజాతః పితృమాతృధనం శిశుః ।
రుద్రోయాగం నికేవేశ మృత్యుశ్చైవ యథాక్రమం ॥
పౌష్ణాశ్విన్యో స్సార్పపిత్రర్క్షయోశ్చ
యచ్చ జ్యేష్ఠామూలయో రంతరాళం
తద్గండాంతం తం చతుర్నాడికాశ్చ
యాత్రా జన్మోద్వాహకాలే త్వరిష్టం ॥
ఆశ్లేషాంత్యాం మఘాపూర్వాం జ్యేష్ఠాంత్యాం మూలపూర్వకం।
రేవత్యశ్వినయో ర్మధ్యే గండాంతం ఘటికాద్వయం॥
అభుక్త మూలసంభవం పరిత్య జే త్సబాలకం।
అథవా అష్టమాసాని పితుర్దర్శన వర్జనమ్॥
సమాష్టకం పితా భవా న తన్ముఖం విలోకయేత్।
జ్యేష్ఠాంతే ఘటికా చైకా మూలాదౌ ఘటికాద్వయమ్॥
అభుక్తమూల మిత్యాహుః తత్ర జాతం శిశుం త్యజేత్ ॥
ఉత్తరే ప్రథమే మాసం పుష్యేచైవ త్రిమాసకం।
పూర్వాషాఢా త్రిమాసేషు చిత్రా షణ్మాసికే భవేత్॥
నవమాసం తథాశ్రేషా అష్టవర్షంతు మూలయోః॥

జ్యేష్ఠాపంచదశే మాసే పర్ణయే త్పుత్రదర్శనం ॥
ఉత్తరే తిలపాత్రంతు పుష్యే గోదాన ముచ్యతే ।
ఆశ్లేషా ఘోటకం దద్యాత్ మూలా మాహిష మేవచ ॥
త్వష్ట్రిభే వస్త్రయుగ్మంచ పూర్వాషాఢేతు కాంచనం ।
గాం దద్యా జ్జ్యేష్ఠనక్షత్రే సర్వదా శుభ ముచ్యతే ॥
ఉత్తరే ప్రథమే పాదే నాడికా త్రయ ఉచ్యతే ।
పుష్యే ద్వితీయపాదేచ నాడికాషట్క ముచ్యతే॥
పూర్వాషాఢా త్రిపాదేచ నాడికా నవ ఉచ్యతే ।
చిత్తార్థం నాడికా షట్కం జ్యేష్ఠాశ్లేషాంత్యపాదయోః ॥
మూలే సర్వగతం దోషం సప్తనక్షత్ర యోస్తథా ।
పుమా నాజ్యకతం దోషం సప్తా ద్భుట పితా హరేత్ ॥

నక్షత్ర గండాని

శ్లో॥ తిథ్యర్ధగండే పితృమాతృహానిః
లగ్నస్య గండే తనయస్య హానిః
సర్వే. జనో జీవతి హంతి లగ్న
జీవే సుతస్యా దభివాహుకశ్చ ॥

తా:— తిథిగండము తండ్రికిని, నక్షత్రగండము తల్లికిని, లగ్న గండము శిశువునకును దోషము. మూడుదోషములును చేరిన మాతాపితృ శిశువులకు ముగ్గురకును దోషము. లగ్నమందు గురువుంటే పైదోషములు నశించును.

శ్లో॥ అశ్విన్యాః ప్రథమే పాదే జన్మచే త్పితృదోషకృత్ ।
త్రిమాసావధితద్దోషః శామ్యతి స్వర్ణదానతః ॥
యామ్యేతృతీయపాదేచ జాతో యది భవే చ్ఛిశుః ।
శిశో ర్దోషో భవే త్తత్ర యావత్పాదచతుష్టయం ॥

తా:— భరణి 3 వ పాదమందు జననమైతే శిశువునకు 27 దిన ములవరకు దోషము.

శ్లో॥ రోహిణీప్రథమే పాదే మాతులస్తు వినశ్యతి ।
ద్వితీయే పితరం హన్తి తృతీయే మాతులం తథా।
చతుర్థే యది జాయేత పుత్ర స్సర్వశుభావహః ।
పుష్యర్థే కర్కటే లగ్నే దివాచే త్పుత్రసంభవః ।
పితృదోష స్తదా జ్ఞేయః తథా పుష్యేచ కర్కటే ।
పుత్రీజన్మ నిశాయాంచే న్మాతృదోషం వినిర్దిశేత్ ॥
పుష్యప్రథమపాదేచే జ్జన్మమాతులదోషకృత్ ।
ద్వితీయపాదే మధ్యేచే జ్జననంతు త్రిమాసకం ॥
మాతులస్య భవే ద్దోషః నివృత్తి ర్గంధదానతః ॥
సర్పర్థే ప్రథమే పాదే జన్మచే చ్ఛుభకృ ద్భవేత్ ।
ద్వితీయే శిశుదోష స్స్యా త్తృతీయే మాతృదోషకృత్ ।
చతుర్థే పితృదోష స్స్యా న్నివృత్తి ర్గంధదానతః ॥
ఆశ్లేషాంతే మఖాదౌచ జ్యేష్ఠాంతే మూలభా దిమే ।
రేవత్యంతే శ్వనీభాదౌ ద్వేద్వేతు ఘటికే క్రమాత్ ॥
పండితై ర్దోషఘటికాః ప్రోక్తా తత్సంభవస్యహి ।
గృహశాంతి శ్శిశోః కార్యే త్యాహు ర్జ్యోతిర్విదో బుధాః ॥
మఖర్థే ప్రథమే పాదే జన్మచే త్పితృదోషకృత్ ।
మాసపంచకపర్యంతం సదోష స్తస్య శాంతయే ।
కర్తవ్య మశ్వదానం స్యా త్పశ్చా త్పాదత్రయం శుభం ॥
ఉత్తరాప్రథమే పాదే చతుర్థే చ జని ర్యది ।
పిత్రో స్సహోదరస్యాపి త్రిమాసావధిదోషకృత్ ।
తిలపాత్రప్రదానేన తచ్ఛాంతి స్తు భవే ద్ధ్రువమ్ ॥
చిత్తాద్యద్విత్రిపాదేషు జననంతు శిశో ర్యది ।
పితు స్సహోదరాణాంచ షణ్మాసావధిదోషకృత్ ।
తచ్ఛాంతి ర్వస్త్రదానేన భవిష్యతి న సంశయః ॥

జ్యేష్ఠరఘటికా స్సర్వా విభజ్య దశధా దిమే ।
భాగే మాతామహీ దోషః పితామహ్యా ద్వితీయకే ।
పిత్రో ర్దోష స్తృతీయేతు మాతృష్వసు రరిష్టకృత్ ।
చతుర్థే సోదరారిష్టం పంచమే శిశుదోషకృత్ ।
షష్ఠేతు శుభదం జన్మ సప్తమే దారదోషకృత్ ।
అష్టమే శిశుదోషః స్యాత్ నవమే పితృదోషకృత్ ।
దశమే మాతృదోషః స్యాత్ ఏవం జ్యేష్ఠాఫలం భవేత్ ॥
తురీయపాదే జ్యేష్ఠర్షే శిశో ర్జన్మ భవే ద్యది ।
నవమాసావధి తదా పితృదోషశ్చ జాయతే ॥
దోషస్యాపి భవే చ్ఛాంతి ర్గోదానేన న సంశయః ।
జ్యేష్ఠాంతే పాదఘటికా మూలాదౌ పాదనాడికా ।
మిళిత్వై వార్ధఘటికా సాంతరాళాభిధా స్మృతా ।
తత్రాంతరాళే జాతస్య దోషః పుత్రస్య సంభవేత్ ।
స్త్ర్యపత్యం యది జాయేత తస్య దోషా న సంభవేతా ॥
మూలస్య ఘటికా స్సర్వా విభజ్య ద్వాదశాంతతః ।
ఆద్యే భాగే పితు ర్దోషః ద్వితీయే మాతృదోషకృత్ ।
తృతీయే భ్రాతృదోష స్స్యాత్ చతుర్థే స్వసృదోషకృత్ ।
పంచమేశ్వశు రారిష్టం షష్ఠే పితృవ్యదోషకృత్ ।
మాతృష్వసు రరిష్టంచ సప్తమే భవతి ధ్రువం ॥
అష్టమే ధనహానిశ్చ నవమే జీవనవ్యయః ।
దారిద్ర్యం దశమే జన్మ భృత్యదోష స్తథా భవేత్ ॥
ఏకాదశే ద్వాదశేతు జాత స్యారిష్ట మావహేత్ ।
మాసత్రితయపర్యంతం దోషోయ మనువర్తతే ॥
శాంతి ర్మహిష్యాదానేన దోష స్యాస్య భవిష్యతి ।
మూలర్షే ప్రథమేపాదే జన్మచే త్పితృదోషకృత్ ।
ద్వితీయే మాతృదోషః స్యాత్ తృతీయే ధనహానికృత్ ।

చతుర్థే జన్మకుభవం ఏవం జ్యోతిర్విదో విదుః ।
పూర్వాషాఢర్క్షకే చాపే దివా పుత్రజని ర్యది ।
పితృనాశం తదా ప్రాహుః జ్యోతిశ్శాస్త్రవిచక్షణాః ॥
పూర్వాషాఢా ధనుర్లగ్నే పుష్యే కర్కాటకే తథా ।
సూర్యోదయేచాస్తమయే హ్యర్ధరాత్రేచ సంగతే ।
యదిచే త్పుత్రజన్మస్యా చ్ఛిశో ర్దోష స్తదా భవేత్ ॥
పూర్వాషాఢాధనుర్లగ్నే జాతః పితృవినాశకృత్ ।
పుష్యే కర్కాటకే లగ్నే పితు ర్మరణ మాదిశేత్ ।
రేవతీ తుర్యపాదేచే జ్జననం పితృదోషకృత్ ।
సత్రిమాసావధి ర్దోషః తచ్ఛాంతి స్స్వ ర్ణదానతః ॥

బాలారిష్టయోగములు

శ్లో॥ చంద్రాష్టమంచ ధరణీసుతసప్తమంచ ।
రాహూర్నవంచ శవి జన్మ గురు స్తృతీయే ।
అర్కస్తు పంచ భృంగుషష్ఠ బుధ శ్చతుర్థే ।
కేతు స్తృతీయ ఇతి బాలకమృత్యుయోగాః ॥

వర్జ్యకాలమున చేయదగినపనులు

శ్లో॥ స్నానే దానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే ।
ప్రాయశ్చిత్తే తథా శ్రాద్ధే ప్రశస్తా విషనాడికాః ॥
శ్లో॥ ఆసనే శయనే భోజ్యే మలమూత్రవిసర్జనే ।
ఉగ్రకర్మ ణ్యస్త్రవధే ప్రశస్తా విషనాడికాః ॥

తా:— స్నానము, దానము, జపము, హోమము, వైశ్వదేవము దేవతార్చన, ప్రాయశ్చిత్తము, శ్రాద్ధము, ఆసనము, శయనము. భోజనము, మలమూత్రవిసర్జనములు, అస్త్రప్రయోగాదిఉగ్రకర్మలు. వీనికి విషఘడియలు ప్రశస్తములు.

## స్మార్తఘంటానాదలక్షణమ్

ఆదౌ మధ్యాభిషేకాంతే ధూపే దీపే తథైవచ ।
నీరాజనే చ శయనే ఘంటానాదం సమాచరేత్ ॥
ఘంటానాదవిహీనా యా సా పూజా నిష్ఫలా భవేత్ ।
స్నానే ధూపే తథా దీపే ఏకపార్శ్వంతు తాడయేత్ ॥
పార్శ్వాభ్యాం తాడనం శేషే భాగస్యాగ్రఘంటవత్ ।
నైవేద్యకాలే యః కుర్యా ద్రౌరవం నరకం వ్రజేత్ ॥

## సాలగ్రామప్రశంసా

సాలగ్రామశిలా యత్ర పూజ్యతే భగవన్మయైః ।
తద్దేశే యోజనా దర్వాక్ మృతో నిర్వాణ మశ్నుతే ॥
సాలగ్రామశిలాయాస్తు నచ సంప్రోక్షణం స్మృతం ।
న ప్రతిష్ఠా విధాతవ్యా నచైవావాహనాదికం ॥
అగ్రాహ్యం శివనైవేద్యం పత్రం పుష్పం ఫలం జలం ।
సాలగ్రామశిలాసంగాత్ సర్వం యాతి పవిత్రతాం ॥
సాలగ్రామా స్సమాః పూజ్యాః విషమా న కదాచన ।
విషమే త్వేకఏవ స్యాత్ సమత్వే ద్విత్వవర్జనం ॥

## తులసీదళవిచ్ఛేదవిషయః

శ్లో॥ స్వారామజం చోత్తమం స్యాత్ ఆరణ్యం మధ్యమం ఫలం ।
విక్రీత మధమం లబ్ధం యాచ్ఞా పూజాచ నిష్ఫలా ॥
రవివారం వినా దూర్వాం తులసీం ద్వాదశీం వినా ।
జీవితస్యావినాశాయ ప్రవిచిన్వీత ధర్మవిత్ ॥
ద్వాదశ్యాం తులసీపత్రం ధాత్రీపత్రంచ కార్తికే ।
లునాతి స నరో గచ్ఛే న్నిరయా నతిగర్హితాన్ ॥

ద్వాదశ్యాంచ దివా స్నావః తులస్యపచయ స్తథా ।
విష్ణోశ్చాపి దివా స్నానం వర్జనీయం సదా బుధైః ॥
భృగ్వర్క కుజవారేషు ద్వాదశ్యాం నిశి సంధ్యయోః ।
తులసీదళవిచ్ఛేదః విష్ణో శ్శిరసి కృంతనం ॥

నిషిద్ధదివసే చాపి అమాయా మపి భార్గవే ।
తులస్యాహరణం శస్తం మమ పూజార్థ మర్జున ॥
దేవార్థే తులసీఛేదో హోమార్థే సమిధ స్తథా ।
ఇందుక్షయే వ దుష్యేత గవార్థంతు తృణస్యచ ॥

పాలాశం దిన మేకంతు పంకజంచ దినత్రయం ।
పంచాహం బిల్వపత్రంచ దశాహం తులసీదళం ॥
తులసీపర్యుషితానైవ బిల్వంతు త్రిదినావధి ।
పద్మం పంచదినా త్త్యాజ్యం శేషం పర్యుషితం విదుః ॥

మాత్స్యే:- బిల్వపత్రంచ మాఘ్యంచ తమాలామలకీదళే ।
కహ్లారం తులసీచైవ పద్మంచ మునిపుష్పకం ॥
ఏత త్పర్యుషితం న స్యాత్ కుశాశ్చ కలికా స్తథా ॥

స్కాందే దమన ముపక్రమ్య

శ్లో॥ తస్య మాలా భగవతః పరమప్రీతికారిణీ ।
శుష్కా పర్యుషితావాపి న దుష్టా భవతి క్వచిత్ ॥

తులసీదళవిచ్ఛేదకాలే పఠనీయశ్లోకాః

శ్లో॥ తులస్యమృతజ న్మాసి సదా త్వం కేశవప్రియే ।
కేశవార్థం లునామి త్వాం వరదా భవ శోభనే ।
త్వదంగసంభవైః పత్త్రైః పూజయామి యథా హరిం ।
తథా కురు పవిత్రాంగం కలౌ మలవినాశినీ ॥

పరుష్యష్పసకాదిం బ్రాహ్మణః స్వయమాహరేత్ ।
శూద్రానీతైః క్రయక్రీతైః కర్మ కుర్వన్ వ్రజత్యధః ॥
వృంతహీనం ద్రోణపుష్పం సర్వే వృంతసమన్వితాః ।
కింజల్కహీన మర్కస్య సర్వే కింజల్కసంయుతాః ॥

రుద్రాక్షమహిమా

శ్లో॥ రుద్రాక్షమాలయా జప్తో మంత్రోనంతఫలప్రదః ।
అరుద్రాక్షో జపః పుంసాం తావన్మాత్రఫలప్రదః ॥
యస్యాంగే నాస్తి రుద్రాక్షః ఏకోపి బహుపుణ్యదః ।
తస్య జన్మ నిరర్థం స్యాత్ త్రిపుండ్రరహితం యది ॥
రుద్రాక్షం మస్తకే బధ్వా శిరస్నానం కరోతి యః ।
గంగాస్నానఫలం తస్య జాయతే నాత్ర సంశయః ॥
రుద్రాక్షం పూజయేద్యస్తు వినా తోయాభిషేచనమ్ ।
యత్ఫలం లింగపూజాయాః తదేవాప్నోతి నిశ్చితమ్ ॥
రుద్రాక్షమూలం తద్బ్రహ్మా తన్నాళం విష్ణురేవచ ।
తన్ముఖం రుద్ర ఇత్యాహుః తద్బిందుస్సర్వదేవతాః ।
రుద్రాక్షధారణాత్సద్యః సర్వపాపైః ప్రముచ్యతే ॥

బ్రాహ్మణో బిభృయాచ్ఛ్వేతాన్ రక్తాన్ రాజాతు ధారయేత్ ।
వైశ్యస్తు బిభృయాత్ పీతాన్ కృష్ణాన్ శూద్రస్తు ధారయేత్ ॥

నోటు:— రుద్రాక్షధారణామంత్రము, మాలాధానము మున్నగు విశేషములను నిర్ణయసింధు- రుద్రాక్షజాబాలోపనిషత్తు మున్నగు గ్రంథములయందు గాంచనగును.

పూజావిధిః

శ్లో॥ మధ్యమానామికామధ్యే పుష్పం సంగృహ్య పూజయేత్ ।
అంగుష్ఠతర్జన్యగ్రాభ్యాం నిర్మాల్య మపనోదయే ॥

అపనీతంచ నిర్మాల్యం చండేశాయ నివేదయేత్ ।
అశూన్య మస్తకం లింగం సదా కుర్వీత పూజకః ॥
వరం ప్రాణపరిత్యాగః శిరసో వాపి కర్తనం ।
నచైవాపూజ్య భుంజీత శివలింగే మహేశ్వరం ॥
వినా భస్మత్రిపుండ్రేణ వినారుద్రాక్షమాలయా ।
పూజితోపి మహాదేవో నస్యాత్తస్య ఫలప్రదః ॥
తస్మా న్మృదాపి కుర్వీత లలాటేవై త్రిపుండ్రకం ॥
వినా మన్త్రేణ యో ధత్తే రుద్రాక్షం భువి మానవః ।
సయాతి నరకాన్ ఘోరాన్ యావ దింద్రాశ్చ తుర్దశ ॥

జపవిధిః

శ్లో॥ ప్రాఙ్ముఖ శ్చోదఙ్ముఖోవా ద్వివాసా శుద్ధమానసః ।
ప్రశస్తమాలయా విద్వాన్ జపం కుర్యా ద్విధానతః ॥
తర్జన్యా న స్పృశే న్మాలాం కరభ్రష్టాం న కారయేత్ ।
న కంపయే చ్ఛిరో గ్రీవాం దంతాన్నైవ ప్రకాశయేత్ ॥
ఉపలిప్తే శుచౌ దేశే నిరాహారో జితేంద్రియః ॥

దత్తతచేసికొనతగని బాలుర

శ్లో॥ దౌహిత్రం త్వసపిండ పుత్రగజ మఖోత్సృష్టం పురా సంస్కృతం
పుత్రైకం పరశాఖినంచ భగినీసూనుం నియుక్తం పురా
యో గృహ్ణాతి దదాతి శాస్త్రవిముఖో అజ్ఞాప్రదా యే నరాః
తే సర్వే నిరయం విశంతి సహసా తస్మా దిమాన్ వర్జయేత్॥

తా:— దౌహిత్రుడు, అన్యగోత్రికుడు, జ్యేష్ఠుడు, ఒకరు కొన్ని రోజులు పెంచి విడచినవాడు, ఉపనయనమైనవాడు, ఏకపుత్రుడు, అన్యశాఖీయుడు, తోబుట్టువుకుమారుడు, పూర్వము వొకరికి వాగ్దానము చేయ

బడినవాడు నగు బాలుని శాస్త్రవిముఖుడై యెవడు గ్రహించునో, యెవడు దత్తతయిచ్చునో, యెవ్వ రనుమతింతురో అట్టివారు నరకమున కేగుదురు కనుక నట్టివారిని వర్జించవలెను.

పాదచ్ఛాయలచే ఘటికాప్రమాణమును తెలిసికొనుట

శ్లో॥ యావత్య శ్చరణప్రభాః ప్రతిదినం మేషాదిషట్సు క్రమా
ద్వ్యేద్వ్యాశ్చైవ తులాదిషట్సు జలధి త్రిద్వ్యక్షిరామాబ్ధయః
అర్ధీకృత్య దినప్రమాణఘటికా స్సప్తాహతా నాడికా
స్తావత్యాః పరపూర్వయోః స్థితగతా యత్పూర్వసంఖ్యాభిధాః ॥

తా:— తననీడను తనయడుగులచే గొలిచి ఆయడుగుల సంఖ్యతోడ మేష, కన్యా, తులా, మీన మాసములయందు 4 ను; వృషభ, సింహ, వృశ్చిక, కుంభ మాసములయందు 3 ను, మిథున, కర్కాటక, ధను, మకర మాసములయందు 2 ను చేర్చి, అహఃప్రమాణఘటికలను రెండు భాగములు చేసి, అందొకభాగము నేడింటగుణించి, పూర్వోక్తంబగు నధిక సంఖ్యతోజేరిన పాదచ్ఛాయలసంఖ్యచే భాగించగా నేర్పడినన్ని గడియల ప్రొద్దు మధ్యాహ్నమునకుముందైన జరిగినదనియు, పిమ్మటనైన నున్నదనియు గ్రహించవలెను.

నోటు:— నక్షత్రస్వరూపములును, రాత్రిప్రొద్దు తెలిసికొను విధానమును ముహూర్తదర్పణమున చూడనగును. గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

పంచత్వక్పంచపల్లవములు

శ్లో॥ న్యగ్రోధ పిప్పల ప్లక్ష జంబూ చూత తరూద్భవాః ।
పల్లవాః పంచ విజ్ఞేయాః త్వ క్చైతే షామ పీష్యతే ॥

### పంచరత్నములు

శ్లో॥ సువర్ణం రజతం ముక్తా రాజావర్తం ప్రవాళకమ్ ।
రత్నపంచక మాఖ్యాతం శేషం వసు బ్రవీ మ్యహమ్ ॥

### నవరత్నములు

శ్లో॥ మాణిక్యంచైవ వైడూర్యం నీలం మరకత స్తథా ।
మౌక్తికం స్పటికం వజ్రం పుష్యరాగప్రవాళికే ॥
ఏతాని నవరత్నాని సర్వకుంభేషు నిక్షిపేత్ ॥

### యమళయో ర్జ్యేష్ఠకనిష్ఠత్వ నిర్ణయః

వైద్యనాథదీక్షితీయే- శ్రాద్ధకాండే - 13 పుటే

మనుః:- యమయో శ్చైకగర్భేతు జన్మతో జ్యేష్టతా స్మృతా ॥
స్మృత్యంతరేపి:-యమయో ర్జాతయో ర్జ్యేష్ఠో జన్మనా ప్రోచ్యతే బుధైః।
గర్భస్య కస్యచి ల్లోకే చిరా జ్జననదర్శనాత్ ॥
అన్యత్రాపి।- యమయో ర్జననాత్ జ్యైష్ఠ్య మాధానం చేష్యతే బుధైః ।
ఏతత్సమభాగస్థ గర్భవిషయమ్ ।
శ్లో॥ పార్శ్వయో స్సంస్థితౌ గర్భా తయో ర్యః పూర్వజ స్సతు ।
జ్యేష్ఠ ఇత్యుచ్యతే సద్భిః జాతకాదిషు కర్మసు ॥
ఇతిబాదరాయణస్మరణాత్ అతఏవోప ర్యధోభాగస్థ గర్భవిషయే స్మృత్యంతరమ్ ॥
శ్లో॥ యమళా చైకగర్భేతు స్త్రీవా పురుషఏవవా ॥
కనిష్ఠ ఆద్యజాత స్స్యాత్ పశ్చా జ్జాతో గ్రజః స్మృతః ॥
స్థలవిశేషాపరిజ్ఞానేతు శిష్టాచారాత్ కనిష్ఠ ఆద్యజాతస్స్యా దితి వచనార్థో గ్రాహ్యః ॥

శ్లో॥ యదా విళ ద్విధా భూతం వీర్యం పుష్పం పరిక్షరత్ ।
ద్వౌ తదా భవతౌ గర్భౌ సూతి ర్వ్యేళ విపర్యయాత్ ॥

తా :— గర్భాధానసమయమున వీర్యము రెండుభాగములుగా నెప్పుడు యోనియందు ప్రవేశించునో అప్పుడు యమళలు జన్మింతురు. వెనుకప్రవేశించిన పిండము ముందుగను ముందుప్రవేశించిన పిండము రెండవమారుగను జన్మించును. కనుక రెండవమారు జన్మించినవాడు జ్యేష్ఠు డగును. మొదటపుట్టినవాడు కనిష్ఠుడు.

రెండుపిండములును ఒకదానిప్రక్కన నొకటియుండినట్లు గ్రహింపగల్గినచో మొదట జన్మించినవాడే జ్యేష్ఠుడు ఒకడు జన్మించిన కొంత కాలమునకు మరియొకడు జన్మించినను మొదటపుట్టినవాడే జ్యేష్ఠుడు.

పైన నొకపిండమును క్రింద నొకపిండమును ఉన్నట్లు గ్రహింపగల్గినను, ఏవిషయమును గ్రహించలేకపోయినను మొదటజన్మించినవాడు కనిష్ఠు డనియు, రెండవమారుపుట్టినవాడు జ్యేష్ఠుడనియు నిర్ణయించుకొన వలెను.

శ్లో॥ తస్మా ద్విమృశ్య కర్తవ్యం వ్రతకర్మాదికం పితా ।
తయో ర్వ్యుత్క్రమతః కుర్యాత్ పితాయమళయో ర్యది ॥
పరివిత్తిః పూర్వజ స్స్యాత్ పరివేత్తా ద్వితీయజః ।
తయో ర్యదిహ సంతానో పరిపంథోదయో భవేత్ ॥

గ॥ వ్యుత్క్రియా న్మౌంజిబంధాదికం అజ్ఞానాత్ కృతంచేత్ పరివిత్తిపరివేత్తృప్రాయశ్చిత్తం కృత్వా వివాహాదికం కుర్యాత్॥ అన్యథా దోషః॥ క్షత్రియవైశ్యయోరప్యేవమేవ ॥

శ్లో॥ ఏకస్మిన్ వత్సరే చైక వాసరే మంటపేపిచ ।
కర్తవ్యం మంగళం స్వస్రోః భ్రాత్రో ర్యమళజాతయోః ॥

తా:— తండ్రియగువాడు జ్యేష్ఠకనిష్ఠన్యాయమును బాగుగా విచారించి ఉపనయనాదికర్మల నాచరింపవలెను. లేనిచో దోషము సంభవించును. యమళలకు ఒకేసంవత్సరమున నొకేరోజున నొకే మంటపమందైనను ఉపనయన వివాహాది మంగళముల నాచరించవచ్చును,

శివాలయప్రదక్షిణవిధిః

శ్లో॥ వృషం చండం వృషంచైవ సోమసూత్రం పునర్వృషం ।
చండంచ సోమసూత్రంచ పునశ్చండం పునర్వృషం ॥
శివప్రదక్షిణేచైవ సోమసూత్రం న లంఘయేత్ ।
లంఘనా త్సోమసూత్రస్య నరకే పతనం ధృవం ॥

తా:— ధ్వజస్తంభమువద్దనుండి బయలుదేరి సప్రదక్షిణముగా చండీశ్వరుని వద్దకు వచ్చి, మరల వెనుకకు ధ్వజస్తంభమువద్దకు వచ్చి, అచ్చటినుండి అప్రదక్షిణముగా సోమసూత్రమువద్దకు వచ్చి, అచ్చటినుండి వెనుకకు మరలి, ధ్వజస్తంభమునుచుట్టి చండీశ్వరునివద్దకువచ్చి, మరల వెనుకకు తిరిగి ధ్వజస్తంభమునుచుట్టి, సోమసూత్రమువద్దకు వచ్చి, అచ్చటినుండి వెనుకకుతిరిగి మరల చండీశ్వరునివద్దకువచ్చి, అచ్చటినుండి వెనుకకు తిరిగి మరల ధ్వజస్తంభమువద్దకు రావలెను,

ఇది యొకప్రదక్షిణ మగును. ఇట్టివి 3 ప్రదక్షిణములు చేయవలెను.

శ్లో॥ అపసవ్యం యతీనాంతు సవ్యంతు బ్రహ్మచారిణాం ।
సవ్యాసవ్యం గృహస్థస్య శంభో ర్నిత్యప్రదక్షిణం ॥
సోమసూత్రద్వయం యత్ర యత్రవా విష్ణుమందిరం ।
అపసవ్యం న కుర్వీత కుర్యా దేవప్రదక్షిణం ॥

తా:— యతీశ్వరుల కపసవ్యము, బ్రహ్మచారులకు సవ్యము, గృహస్థులకు సవ్యాపసవ్యముగ శివప్రదక్షిణము విధించబడినది,

రెండు సోమసూత్రములున్న శివాలయములోను, విష్ణ్వాలయములోను అపసవ్యము పనికిరాదు. సవ్యముగానే ప్రదక్షిణము చేయవలెను.

శ్లో॥ వృషం చండం వృషంచైవ సోమసూత్రం పునర్వృషం।
చండంచ సోమసూత్రంచ పునశ్చండం పునర్వృషం॥

ఈశ్లోకము శనిప్రదోషప్రకరణములో పఠించబడుటచేత నాగార్జున నన్నిలింగములకును నావిధముననే ప్రదక్షిణము నాచరించవలెను.

సూ॥ స్వయంభూలింగత్వా ద్వా॥

స్వయంవ్యక్తములైన ద్వాదశజ్యోతిర్లింగాదిక్షేత్రములయందును పైవిధముననే ప్రదక్షిణము నాచరించవలెను.

శ్లో॥ సూత్రా ద్బహి ర్లంఘనతో న దోషః।
స దోష మభ్యంతరలంఘనేన॥

సోమసూత్రం నలంఘయేత్ -అను నిషేధము, గర్భాలయములో దాటరా దని యర్థము. బైట నతిక్రమించినను దోషములేదు.

స్వయంవ్యక్తములు కాని శివాలయములలో శనిత్రయోదశినాడు పైవిధముగా ప్రదక్షిణము నాచరించవలెను. మిగతాకాలములలో ఆలయముచుట్టును ముమ్మారు సవ్యప్రదక్షిణము చేయవలెను. ప్రదక్షిణము నాచరించినపిమ్మట

శ్లో॥ నందీశ్వర నమ స్తుభ్యం సాంబానందప్రదాయక।
మహాదేవస్య పూజార్థం అనుజ్ఞాం దేహి మే ప్రభో॥

అని నందీశ్వరుని ప్రార్థించి యనుజ్ఞగైకొని-

శ్లో॥ శాంతం పద్మాసనస్థం శశధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగే వహంతం
నాగంపాశంచఘంటాం ప్రళయహుతవహం సాంకుశంవామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥

అను శ్లోకముతో భగవంతుని ప్రార్థించి-

శ్లో॥ హిరణ్యగర్భాదిసురాసురాణాం కిరీటమాణిక్యవిరాజమానం ।
శివస్య తత్పాదసరోజయుగ్మం మదీయమూర్ధాన మలంకరోతు ॥

అనిపాదుకలనుగై కొని

శ్లో॥ వృషస్య వృషణం స్పృష్ట్వా శృంగమధ్యే పినాకినమ్ ॥

అను శ్లోకముచెప్పుచు ఎడమచేతితో నందీశ్వరుని వృషణముల స్పృశించుచు, కుడిచేతితో మారేడుదళములను విభూతిని నందీశ్వరుని శిరముపైనుంచి, కుడిచేతిని శృంగములపైనుంచి, రంధ్రభాగమునుండి 'హరహరహరా' యనుచు శివునివీక్షించి, కొంతసేపు విశ్రమించి యింటి కేగవలెను.

శ్లో॥ కార్తిక్యాం కృత్తికాయోగే యః కుర్యాత్ స్వామిదర్శనమ్ ।
సప్తజన్మ భవే ద్విప్రో ధనాఢ్యో వేదపారగః ॥

తా:— కృత్తికానక్షత్రముతోగూడిన కార్తికపూర్ణిమనాడు భగవంతునిదర్శించినచో ఏడుజన్మలవరకు వేదవేదాంగములనుపఠించినట్టియు ధనవంతుడైనట్టియు బ్రాహ్మణుడై జన్మించును.

శివనిర్మాల్యభక్షణనిషేధః

శ్లో॥ ధరాహిరణ్యగోరత్నతామ్రరౌప్యాంశుకాదికం ।
విహాయ శేషం నిర్మాల్యం చండేశాయని వేదయేత్ ।
అన్య దన్నాదిపానీయం తాంబూలం గంధపుష్పకం ।
దద్యా చ్చండాయ నిర్మాల్యం శివభుక్తం తు సర్వశః ॥
జ్యోతిర్లింగం వినా లింగం యః పూజయతి సత్తమః ।
తస్య నైవేద్యనిర్మాల్యభక్షణా త్తప్త కృచ్ఛ్రకం ॥
బాణలింగే స్వయంభూతే చంద్రకాంతే హృది స్థితే ।
చాంద్రాయణసమం జ్ఞేయం శంభో ర్నైవేద్యభక్షణం ॥

లింగే స్వయంభువే బాణే రత్నజే రసనిర్మితే ।
సిద్ధప్రతిష్ఠితేచైవ న చండాధికృతి ర్భవేత్ ॥
యత్ర చండాధికారోస్తి తద్భోక్తవ్యం న మానవైః ।
చండాధికారో నో యత్ర భోక్తవ్యం తత్ర భక్తితః ॥
బాణలింగే చకా లోహేచ సిద్ధలింగే స్వయంభువి ।
ప్రతిమాసుచ సర్వాసు న చండో ధికృతో భవేత్ ॥

## ప్రయాణప్రశ్న

శ్లో॥ ప్రశ్నాక్షరం ద్విగుణితం ద్వాదశాక్షరసంయుతం ।
సప్తసంఖ్యా హరే చ్ఛేష మి త్యాగమనజం ఫలం ॥
ఏకంచ శ్రూయతే వార్తా ద్వితీయం తత్ర తిష్ఠతి ।
తృతీయం మధ్యమార్గేచ చతుర్థం శీఘ్ర మాగతం ॥
పంచమంచ సమీపస్థః షష్ఠ రోగసమన్వితః ।
సప్తమం మరణంచైవ వదంతీహ మనీషిణః ॥

## వారనక్షత్రయుక్తపంథాప్రశ్న

శ్లో॥ రవౌ గ్రామే తథా దూరే శనౌచ పరిపీడ్యతే ।
బుధే చంద్రే తథా మార్గే సమీపే గురుశుక్రయోః ॥
నిర్జన స్సప్తఋక్షాణి సజీవో ద్వాదశే భవేత్ ।
వ్యాధితో నవఋక్షాణి సూర్యాధిష్ణ్యాత్తు చాంద్రభం ॥

## ప్రశ్న

శ్లో॥ ఏకం (1) దుర్గం (9) సప్తకే (7) వై విలంబః
శీఘ్రం కార్యం స్యా త్త్రి (3) షట్ (6) ద్వాదశేషు (12)
రుద్రే (11) సిద్ధిః యుగ్మకే (2) వృద్ధిరుక్తా
చాంగే (8) తుర్యే (4) దిక్షు (10) భూతేషు (5) నాశః ॥

## ప్రశ్నదర్శినిలోని గ్రహసంఖ్యాప్రశ్న

(1) కటక (౧-౧-౧) స్సవితా సిద్ధిః
(2) ప్రియంగు (౨-౧-౩) శ్శశభృ త్సుఖం
(3) శ్రీరుద్రౌ (౨-౨-౨) భూమిజో నాశః
(4) గోపుర (౩-౧-౨) జ్ఞ స్సుఖీ భవేత్
(5) లాంగలం (౩-౩-౩) వాక్పతే రాజ్యం
(6) గోత్రాయ (౩-౨-౧) సితఉత్తమం
(7) కురంగో (౧-౨-౩) ర్కజ ఆర్తి స్స్యాత్
(8) కాలారో (౧-[illegible]) రాహు రక్షేమం
(9) రోగాఖ్యో (౨-౩-౧ మరణం కేతుః ॥

## ప్రశ్న చూచెడి క్రమము

పృచ్ఛకుని 108లోపుగా నొకసంఖ్య చెప్పుమని ఆసంఖ్యను వ్రాసికొని, 108 లో ఆ సంఖ్య తీసివేసి మిగతలో నొకసంఖ్య చెప్పుమని దానిని వ్రాసికొని, దానిలో నదిపోగా నిలిచినదానినికూడ వ్రాసికొనునది, ఆమూడుసంఖ్యలను 3 చే భాగించవలెను. అప్పుడు 3 శేషములు వచ్చును. 0 శేషమయిన దానిని 3 గానే భావించవలెను. ఆసంఖ్యలమీద నీవాక్యగతఫలములను చెప్పవలెను. ఇది తప్పక ఫలించుచున్నది. ఈ సంఖ్యా మర్మము తెలియనివానిచే లెక్క చెప్పించవలెను.

## పశుప్రశ్నః — దైవజ్ఞవిలాసే

శ్లో॥ వహ్నిత స్సప్త పూర్వేచ మఘాద్యా స్సప్త దక్షిణే ।
మైత్రాది సప్త వారుణ్యే ధనిష్ఠా సప్త ఉత్తరే ॥

తా: — కృత్తికమొదలు 7 నక్షత్రములలో ప్రశ్న అడిగిన తూర్పునయున్నదనియు, మఘమొదలు 7 నక్షత్రములలో దక్షిణమున

నున్నదనియు, అనూరాధ మొదలు 7 నక్షత్రములలో పరపురనున్నదనియు చెప్పవలెను.

శ్లో॥ సూర్యాదినవ నారణ్యే షడ్భిః కర్ణానువర్తతే ।
సప్తసు గృహ మాయాతి ద్వాగత స్త్రిమృతి ర్భవేత్॥

తా:— సూర్యుడున్న నక్షత్రము మొదలు ప్రశ్న నక్షత్రము వఱకు లెక్కించగా మొదటి 9 నక్షత్రములలోను అరణ్యమందున్న దనియు, తర్వాత 6 నక్షత్రములలోను వార్త తెలియుననియు, తర్వాత 7 నక్షత్రములలోను ఇంటికి వచ్చుననియు, తర్వాత 2 నక్షత్రములలోను జాడతెలియదనియు, తర్వాత 3 నక్షత్రములలోను మరణించినదనియు చెప్పవలెను.

## నష్టవస్తు ప్రశ్న

శ్లో॥ తిధి ర్వారంచ నక్షత్రం లగ్నం వహ్నివిమిశ్రితం ।
పంచభిస్తు హరే ద్భాగం శేషం తత్త్వం వినిర్దిశేత్॥
పృధివ్యాంతు స్థిరం జ్ఞేయం అప్సు వ్యోమ్ని న లభ్యతే।
తేజస్తు రాజసం జ్ఞేయం వాయౌ శోకం వినిర్దిశేత్॥
దిశాప్రహరసంయుక్తం తారకావారమిశ్రితం।
అష్టభిస్తు హరే ద్భాగం శేషం పశ్చాత్ పునః పునః॥
పంచభి స్త్వరితే సిద్ధిః షట్ తుర్యేణ దినత్రయం।
సప్తకే త్రీణి వింశాయాం ద్వౌ చాష్టౌ నచ సిద్ధిదా॥

## పుష్కర విషయః

శ్లో॥ మేషేగంగా వృషేరేవా గవేయుగ్మే సరస్వతీ।
యమునాయాం కుళీరేచ గోదాసింహంగతే గురౌ ॥
కన్యాయాం కృష్ణవ్యేశ్చ కావేరాణ్యాశ్చ తులాగతే॥

భీమరథ్యా వృశ్చికేతు చాపే పుష్కరవాహినీ।
మృగే నర్మఘటే సింధు ర్మీనేచ ప్రణితా నదీ॥

సంవత్సరాధిపతయః

శ్లో॥ ప్రభవాదిషు షడ్బ్రహ్మా ప్రమోదాదిత్రయం హరిః।
ధాతాదిపంచ శంభోశ్చ వృషా ద్యష్టౌ విధిః స్మృతః॥
విరోధిత్రితయం విష్ణుః నందనాదిహరో దశ।
శుభకృ ద్ద్వితయం బ్రహ్మ క్రోధిచత్వారి కేశవః॥
కీలకాష్టౌచ రుద్రశ్చ నలషట్కం విధి స్స్మృతః।
దుందుభిద్వితయం విష్ణుః రక్తాక్షిత్రితయం హరః॥

దశదానాని

శ్లో॥ గోభూతిలహిరణ్యాజ్య వాసోధాన్యగుడానిచ ।
రౌప్యం లవణ మి త్యాహుః దశదానాః ప్రకీర్తితాః॥

షోడశ మహాదానాని

శ్లో॥ గావ స్సువర్ణ మహిషీ రత్నానిచ సరస్వతీ।
తిలాః కన్యా హయా నాగా దాసీ రథ మహీ గృహే॥
శయ్యా ఛాగం చాగ్రహారం మహాదానాని షోడశ॥

షోడశ కర్మాణి

శ్లో॥ గర్భాధానం పుంసవనం సీమంతో జాతకర్మచ
నామాన్నప్రాశనే చౌలం మౌంజీ వ్రతచతుష్టయమ్॥
గోదానాఖ్యం స్నాతకంచ వివాహః పైతృమేధికమ్।
ఏతే షోడశసంస్కారాః క్రమేణ స్మార్తకర్మసు ॥

ప్రోక్షణాది విషయమ్

శ్లో॥ ఉత్తానేనతు హస్తేన కర్తవ్యం ప్రోక్షణం భవేత్।
అవాచీనేన హస్తేన కర్తవ్యం స్యా దతోక్షణమ్ ।

అవాఙ్ముష్టిప్రకారేణ అభ్యుక్షణముదీరితమ్।
తిర్యగ్భూతేన హస్తేన పర్యుక్షణ ముదాహృతమ్॥

తా:— వెల్లకింతలైనహస్తముచేత నుదకమును జల్లుట ప్రోక్షణ మనబడును. బోర్లించిన హస్తముచేత నుదకమునుజల్లుట అవోక్షణ మన బడును. బోర్లించిన గుప్పిడిచేత నుదకమును చల్లుట అభ్యుక్షణ మన బడును. అడ్డముగా త్రిప్పిన హస్తముచేత నుదకమును చల్లుట పర్యుక్షణ మనబడును.

గ్రహణే భోజనవిధిః

శ్లో॥ సూర్యగ్రహేతు నాశ్నీయా త్పూర్వం యామచతుష్టయమ్।
చంద్రగ్రహేతు నాశ్నీయా త్పూర్వం యామత్రయం తథా॥
గ్రస్యమానే భవేత్ స్నానం గ్రస్తే హోమో విధీయతే।
ముచ్యమానే భవే ద్దానం ముక్తౌ స్నానం విధీయతే॥

తా:— సూర్యగ్రహణమునకుపూర్వము 4 జాములును, చంద్ర గ్రహణమునకుపూర్వము 3 జాములును భోజనము చేయరాదు, గ్రహ ణము పట్టుప్రారంభించినతోడనే స్నానముచేయవలెను. పట్టుట పూర్తి యైన పిమ్మట హోమమును, విడుపు ప్రారంభించినవెంటనే తర్పణ దానాదులు, విడిచినవెంటనే స్నానమును చేయవలెను. 7గం టలు

నోటు:— హోమము గ్రహణము విడిచినపిమ్మట చేయుట ఆచరణలో నున్నది. చంద్రగ్రహణము అర్ధరాత్రమున వచ్చినచో మరునాడుదయమున స్నానముచేసి గ్రహణహోమముల నాచరించి ప్రాతరౌపాసన చేయుచున్నారు.

శంఖతీర్థప్రోక్షణవిధిః

శ్లో॥ శంఖస్థం ప్రోక్షయే ద్దేవం పుత్రమిత్రపరిగ్రహమ్ ।
విష్ణోః పాదోదకం శంఖే నిక్షిప్య శిరసా ధరేత్ ॥
తులసీమిశ్రితం తీర్థం ... న్మూర్ధ్నాచ ధారయేత్ ॥

సాలగ్రామ తీర్థప్రాశనవిధిః

శ్లో॥ వస్త్రం చతుర్గుణీకృత్య పాణౌ పాణిం విధాయచ ।
సాలగ్రామశిలాతోయం త్రిః పిబే ద్బిందువర్జితమ్ ॥
ప్రథమం కాయసిద్ధ్యర్థం ద్వితీయం ధర్మసాధనమ్ ।
తృతీయం మోక్ష మాప్నోతి హ్యేవం తీర్థం త్రిధా పిబేత్ ॥
విష్ణోః పాదోదకం పీతం బ్రహ్మహత్యాఘనాశనమ్ ।
తదేవాష్టగుణం పాపం భూమౌ బిందునిపాతనే ॥

ఆత్మయజ్ఞ మంత్రపఠనవిధిః

శ్లో॥ పంచాయతనపూజాంతే తీర్థప్రాశన మాచరేత్ ।
ఆత్మయజ్ఞానువాకంతు గీతానాం చోర్ధ్వమూలకమ్ ॥
ఏతద్ద్వయం పఠే ద్యస్తు సర్వపాపాత్ప్రముచ్యతే ।
సర్వక్రతుఫలం యాతి సముక్తో నాత్ర సంశయః ॥

భోజనకాలవిశేషాః

శ్లో॥ చతురశ్రం త్రికోణంచ వర్తులం చార్ధచంద్రకమ్ ।
కర్తవ్య మానుపూర్వేణ మణ్డలం బ్రాహ్మణాదిషు ॥
ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే యశస్వీ దక్షిణాముఖః ।
శ్రీకామః పశ్చిమో భుంక్తే నకదాచి దుదఙ్ముఖః ॥

పాలాశంకదళీ జంబూ పన సామ్రాణి చంపకమ్ ।
పద్మోదుంబర పత్రాణి శస్తాని గృహిణ స్సదా ॥

భుక్తిపాత్రస్య శుద్ధ్యర్థం పాత్రం స్పృష్ట్వా ఘృతేనచ ।
పరివేషంతు నిర్వర్త్య చరే త్తదభిఘారణమ్ ॥

పాత్రాభిఘారణం కుర్యా త్పైతృకేషు విశేషతః ।
శుభకార్యేషు సర్వేషు నాభిఘారణ మిష్యతే ॥

శాకాదిపురత స్థాప్యం మధ్యేన్నం పరివేషయేత్ ।
దక్షిణే పాయసం సూపం భక్ష్యం చోష్యంచ వామతః ॥
పరివేషణసంపూర్ణే సర్పిష్షె వాభిఘారయేత్ ।
అన్నేతు పాయసే భక్ష్యే న కుర్యా ద్వ్యంజనాదిషు ॥
పూర్వం నివేదనా త్పాత్రే లవణం నైవ దాపయేత్ ।
భుక్తికాలే ప్రదాతవ్యం లవణం దధిమిశ్రితమ్ ॥
అనుచ్ఛిష్టేతు లవణం ఉచ్ఛిష్టే ఘృతపాయసే ।
అజ్ఞానా ద్యది వై దద్యాత్ నరకం ప్రతిపద్యతే ॥
యది ప్రత్యక్షలవణం గ్రాహ్యం తేజో యశో హరేత్ ।
రాత్రౌ భోజనకాలేతు నోచ్చరే ల్లవణం సదా ॥
నిశి ప్రత్యక్షలవణం న దాతవ్యం కదాచన ।
ప్రమాదా ద్దీయతే భోక్తు రాయుక్షీణం న సంశయః ॥
తద్దోషపరిహారార్థం లవణం దీపదర్శనమ్ ।
దధ్నా జలేన సంమిశ్రం భక్షయే న్నైవ దోషకృత్ ॥
దక్షిణస్థాన మారభ్య భాజనస్య ప్రదక్షిణమ్ ।
అచ్ఛిన్నధారాం కుర్వీత సమంతం పరిషేచనమ్ ॥
ముష్టీకృతేన హస్తేన పరిషేచన మాచరేత్ ॥
ఆపోశనార్థ ముదకం కరే నిక్షిప్య దక్షిణే ।
పాత్రం ధృత్వా థ పేయం చా మృతోప స్తరణేన వై ॥
అపోశనార్థ ముదకం గ్రాహ్య మన్యైశ్చ బంధుభిః ।
స్వహస్తేనతు యః కుర్యాత్ నరకం ప్రతిపద్యతే ॥
ఆపోశనాసనేశయ్యా తైలాభ్యంగం తథైవచ ।
స్వయంకరకృతంచైవ మాయుశ్శ్రీపుత్రనాశనమ్ ॥

'అహం వైశ్వానరో భూత్వా' 'హ్యాన్నం బ్రహ్మ రసం' తథా,
అనంస్పృష్ట్వా పఠేద్యస్తు హ్యాన్నదోషో న విద్యతే॥

దినేదినే గృహస్థస్య దివా భాగే విశేషతః।
అహం వైశ్వానరో భూత్వా' ఇతి మంత్రం సముచ్చరేత్॥

సాయంప్రాత ర్ద్విజాతీనా మశనం శ్రుతిచోదితమ్।
నాంతరా భోజనం కుర్యా దగ్నిహోత్రసమో విధిః॥

జలపాత్రంతు నిక్షిప్య దక్షిణే మణిబంధకే।
భుక్తికాలేతు విప్రోపై పిబే దన్యేన పాణినా॥

ఏకపం క్త్యుపవిష్టానాం విప్రాణాం సహ భోజనే।
య ద్యేకోపి త్యజే త్పాత్రం శేష మన్నం న భక్షయేత్।
భుంజానేషు చ విప్రేషు యోగ్రే పాత్రం విముంచతి।
స మూఢో నరకం యాతి బ్రహ్మఘ్నో సతు జాయతే॥

అప్యేకపంక్తౌ నాశ్నీయాత్ బ్రాహ్మణై స్స్వజనైరపి।
కోహి జానాతి కిం తస్య ప్రచ్ఛన్నం పాతకం భవేత్॥
అగ్నినా భస్మనాచైవ స్తంభేన సలిలేనవా।
అంతరే ద్వారదేశేతు పంక్తిదోషో న విద్యతే॥
ఉదకంచ తృణం భస్మ ద్వారం పంథా స్తథైవచ।
ఏభి రంతరితం కృత్వా పంక్తిదోషో న విద్యతే॥
దక్షిణం భుజ మాశ్రిత్య సర్వా స్తిష్ఠంతి దేవతాః।
ఉత్తరాపోశనం శేషం వామభాగే విసర్జయేత్॥
ఉత్తరాపోశనజలం త్యజే ద్రౌరవతీర్థతః।
తర్జన్యగ్రేణ నిర్ముక్తం రౌరవం తీర్థ ముచ్యతే॥
హస్తప్రక్షాళనం యత్ర పాదౌ తత్రైవ క్షాళయేత్।
ప్రక్షాళయే చ్చార్ధపాదౌ భుక్త్వాంతేవా యదా కదా॥

తత్కర్మ విఫలం యాతి దారిద్ర్యం సమవాప్యతే ।
శర్యాతించ సుకన్యాంచ చ్యవనం చేంద్ర మశ్వినౌ ॥
భోజనాంతే స్మర న్నక్ష్ణో రంగుష్ఠాగ్రాంబునిక్షిపేత్ ॥

భోజనకాలే దీపనాశః

శ్లో॥ రాత్రౌ భోజనకాలేషు యది దీపో వినశ్యతి ।
పాత్రం ధృత్వాతు పాణిభ్యాం భాస్కరం మనసా స్మరేత్ ॥
దృష్ట్వాతు స పునర్దీపం తచ్ఛేషం భోజయే న్నరః ।
పున రన్నం న భోక్తవ్యం యది భుంజీత కిల్బిషీ ॥

నిశి భోజనే క్షుతే దోషః

శ్లో॥ యో విప్రో భోజనే కాలే రాత్రౌ కుర్యాత్ క్షుతం యది ।
యశోహాని ర్నిర్ధనతా చాజన్మాంతం భవేత్ ధృవమ్ ॥
తద్దోషశమనార్థాయ శిరసి ప్రోక్షయే జ్జలమ్ ।
స్వజన్మథరణీం జ్ఞాత్వా దేవతాస్మరణం చరేత్ ॥
అజ్ఞానా ద్యదివా మోహత్ యో విప్రో నస్మరే ద్యది ।
ఆయుక్షీణం భవే త్తస్య దారిద్ర్యంచ సమశ్నుతే ॥
అన్యాభావే స్వహస్తేన జలం సంప్రోక్ష్య మస్తకే ।
జన్మభూమించ విజ్ఞాత్వా విష్ణో ర్నామాని కీర్తయేత్ ॥

స్వగృహే అగ్రస్థానభోజననిర్ణయః

శ్లో॥ స్వగృహ స్యాగ్రగత స్తిష్ఠేత్ విప్రాణాం నిత్యభోజనే ।
వేదజ్ఞా నపి వృద్ధా న్వా హ్యాథః కుర్యా న్నదోషభాక్ ॥
వేదజ్ఞే ష్వపి వృద్ధేషు భ్రాతరం పితరం వినా ॥

రాత్రౌ విధవాపాకభోజననిషేధః

శ్లో॥ పతిహీనస్త్రియాః పాకం నహిరాత్రౌ భోజయే ద్గృహీ ।
భుంజీత కర్మబాహ్య స్సాత్ మాతరం భగినీం వినా ॥

దీపవిధిః

శ్లో॥ రవేరస్తం సమారభ్య యావత్సూర్యోదయో భవేత్ ।
యస్య తిష్ఠేద్గృహే దీపః తస్య నాస్తి దరిద్రతా ॥
ఆయుష్యం ప్రాఙ్ముఖో దీపో ధనదస్స్యా దుదఙ్ముఖః ।
ప్రత్యఙ్ముఖో దుఃఖదోసౌ హానిస్స్యా ద్దక్షిణాముఖః ॥
ఏకపాత్రే చతుర్దిక్షు దీపాశ్చత్వార ఆస్థితాః ।
శుభదిక్ఫలమిత్యాహు ర్దిక్షు దోషో న విద్యతే ॥

శయనవిధిః

శ్లో॥ స్వగృహే ప్రాక్ఛిరాః కుర్యాత్ శ్వాశురే దక్షిణా శిరాః ।
ప్రత్యక్ఛిరాః ప్రవాసేషు న కదాచి దుదక్ఛిరాః ॥

రాత్రికర్తవ్యం

శ్లో॥ చతుర్థప్రథమౌ యామౌ విద్యాభ్యాసై ర్నయే న్నిశి ।
ప్రహారద్వయశాయీతు బ్రహ్మభూయాయ కల్పతే ॥

ముఖేన ఉదపాననిషేధః

శ్లో॥ ముఖే నోదకపానంచ మృతవత్పాపయ స్తథా ।
పీత్వా ద్విజ స్సకృ న్మోహాత్ కేవలం మహిషీపయః ।
తస్యోపనయనం భూయః తత్పత్కృచ్ఛ్రం విశోధనమ్ ॥

దీపప్రలోపన విధిః

శ్లో॥ దీపప్రలోపనం పుంసాం కూశ్మాండచ్ఛేదనం స్త్రియః
అచిరేణైవ కాలేన వంశచ్ఛేదో భవే ద్ధ్రువం॥
దీపేన దీపం ప్రజ్వాల్య దరిద్రో వ్యాధిమాన్ భవేత్।
కంచుకోత్థేన మరుతా దీపం నైవ నివారయేత్,
ఆననోత్థేన వాతేన హ ససంజాతవాయునా॥

విసృజేతి సముచ్చార్య లోపయే ద్దీప మంచలాత్।
తావచ్చ తూష్ణీం స్థాతవ్యం యావ త్ప్రేషః ప్రశామ్యతి॥
'హే దీప! విసృజ జ్యోతిః' ఇతి సంబోధ్య॥
దీపే నాత్మత నుచ్ఛాయాం తస్య శ్చోపరి త్యజేత్।
తౌ దంపతీ పరిత్రత్వ మాపృవితాం వినిశ్చిత మితి॥

సంధ్యాకాలవర్జ్యములు

చత్వారి ఖలు కర్మాణి సంధ్యాకాలేషు వర్జయేత్।
ఆహారం మైథునం నిద్రాం స్వాధ్యాయంచ తథైవచ॥
ఆహారా జ్జాయతే వ్యాధిః క్రూరగర్భస్తు మైథునే।
శ్రియం హరతి వై నిద్రా స్వాధ్యాయా న్మరణం ధ్రువం॥
ఆయుఃక్షయా దివా నిద్రా దివా స్త్రీ పుణ్యనాశనీ।
ప్రతిషిద్ధదినే గచ్ఛన్ స్త్రియం గచ్ఛ త్యధోగతిం॥

తామ్రపాత్రస్థితగవ్యాదినిషేధః

శ్లో॥ తామ్రపాత్రస్థితం గవ్యం నారికేళోదకం తథా।
అవశ్యం తం పయశ్చైవ పీత్వా చాంద్రాయణం చరేత్॥
తామ్రపాత్రస్థితం దుగ్ధం గోమూత్రం తక్ర మేవవా।
దధివా తామ్రపాత్రస్థం నారికేళోదకం తథా।
ద్విజః పీత్వా సురాపానం కృతవాన్ నాత్ర సంశయః॥

వివాహే భోజననియమః

శ్లో॥ పూర్వయా మేష్టివివాహ స్స్యాత్ తదహ ర్భోజనం త్యజేత్।
కన్యా, దాతా, వర శ్చైవ అత ఊర్ధ్వం న వర్జయేత్॥

గృహే బ్రహ్మచారిత్రయనిషేధః

శ్లో॥ ఏకో విద్వాన్ గోత్రయం సప్తసంఖ్యా
శ్వేతాశ్వానాం రత్నసంఖ్యా గజానాం
షట్పాందోళా చాబ్ధిసంఖ్యా రథానాం
దాస్యః పంచ బ్రాహ్మణా స్సప్తసంఖ్యా॥
భృత్యా పదాశ్చాగ్నిసంఖ్యాశ్చ దారా

షట్కాం సప్త బ్రహ్మచారిత్రియంచ
సంఖ్యా హ్యేషా యస్య గేహే స్థితా చేత్
తేనో హాని ర్విత్తహానిః క్షయో వా॥

సువాసినీ ధర్మాః

శ్లో॥ పత్యౌ జీవతి యా నారీ ఉపోష్య వ్రత మాచరేత్,
ఆయుష్యం హరతే భర్తుః సా నారీ నరకం వ్రజేత్॥
నాస్తి స్త్రీణాం పృథక్ యజ్ఞః న వ్రతం నా ప్యుపోషణమ్।
పతిం శుశ్రూషతే యా స్త్రీ తయా స్వర్గే మహీయతే॥

నిత్యౌపాసనావశ్యకత

సూ- 'ఔపాసన మారప్స్యే। తేన యావజ్జీవం హోష్యామి'॥

తా:— 'ఔపాసన ప్రారంభించుచున్నాను, జీవించియున్నంత కాలము ప్రతిరోజును హోమములు చేయగలను' అని వివాహకాలమున ప్రతిద్విజుడును ప్రతిజ్ఞచేయుచున్నాడు.

శ్లో॥ యో దద్యా త్కాంచనం మేరుం పృథివీంచ ససాగరామ్,
తా త్సాయంప్రాత ర్హోమస్య తుల్యం భవతి వా నవా॥

తా:— మేరుతుల్యమైన కాంచనదానమున్నూ, చతుస్సాగర సమన్విత భూదానమున్నూ సాయంప్రాతర్హోమములతో సాటియగునా? కాదా, అని సంశయముగా నున్నది.

సూ॥ 'పాణిగ్రహణా ద్గృహ మేధినో యావజ్జీవ మగ్నిహోత్రం ధార్యం' ఇతివచనాచ్చ నిత్య మగ్నిహోత్రం ధార్యం.

దైవయోగము వలన ననుగతమైనచో వ్యాహృతిత్రయముతో వెంటనే పునస్సంధానముచేసికొని, అయాశ్చ హోమమున్నూ, సర్వ ప్రాయశ్చిత్తమున్నూ చేయవలెను. 3 రోజులలోపున పునస్సంధానముచేసికొనినను పైవిధముననే చేసి, ఔపాసనలోప ప్రాయశ్చిత్తార్థం సప్తహోత చేయవలెను. 3 మొదలు 7 రోజులవరకు, 'అయాశ్చ మనోజ్యోతిః సర్వప్రాయశ్చిత్తము' అను హోమములున్నూ. 7 మొదలు 10 రోజుల వరకు 'అయాశ్చ, మనోజ్యోతిః, తంతుంతన్వన్, ఉద్బుధ్యస్వ, త్రయ స్త్రింశత్' అను హోమముల నాచరించి, సర్వప్రాయశ్చిత్తమును

చేయవలెను. 10 మొదలు 12 రోజులవరకు 17 పునస్సంధాన హోమ
ములను. సర్వప్రాయశ్చిత్తమును. వ్యాహృతిగృహీతసప్తహోతృహోమ
మును చేయవలెను. 12 రోజులకు పైన కృచ్ఛ్రత్రయముల నాచరించి,
పునస్సంధాన హోమములను చేయవలెను, ఇట్లని గృహ్యప్రాయశ్చిత్తము,
లలో కంఠోక్తిగా జెప్పియుండ, నిత్యాగ్నిహోత్రమును విడి, మాతా
పితరుల ప్రత్యాబ్దికములనాడు, కేవల, విచ్ఛిన్నోపాసనమును మాత్రమే
చేయుట స్మృతికి విరుద్ధముగా నున్నది. కనుక పునస్సంధాన హోమము
లనుగూడ నాచరించుట ముఖ్యమని కొందరు పెద్దలు వ్రాసిచ్చిరి.

## దర్శశ్రాద్ధావశ్యకత

ద్విజులందరును ప్రతియమావాస్యనాడును, పితరులనుగూర్చి, దర్శశ్రాద్ధప్రతినిధిగా, తిలతర్పణముల నాచరించుట ప్రచారములో నున్నది. దర్శశ్రాద్ధప్రతినిధిగా తిలతర్పణముల నాచరించుచున్నాముగాన నొక దర్శశ్రాద్ధమైన నొనర్చి పిమ్మట ప్రతినిధి తిలతర్పణముల నాచరించుట యుక్తమని విజ్ఞులు నుడివిరి.

## అథ నానోత్పాతశాంతయః

శ్లో॥ ప్రాసాదతోరణద్వార ద్వారప్రాకారవేశ్మసు।
అనిమిత్తంతు పతనం దృఢానాం రాజమృత్యవే॥
రాజసా వాథ ధూమేన దిశో యత్ర సమాకులాః।
ఆదిత్య శ్చంద్రతారాశ్చ వివర్ణా భయవృద్ధయే॥
రాక్షసా యత్ర దృశ్యంతే బ్రాహ్మణాశ్చ విధర్మిణః।
ఋతువశ్చ విపర్యస్తా అపూజ్యాః పూజ్యతే జనైః।
నక్షత్రాణి వియోగీని తన్మహా ద్భయలక్షణం।
కేతూదయోపరాగౌ చ ఛిద్రింతౌ శశిసూర్యయోః॥
గ్రహర్క్షవికృతి ర్యత్ర తత్రాపి భయ మాదిశేత్।
శ్వాసృగాలో థవా గృధ్రః కాకో వా యది మానుషః॥
శ్మశానా న్మాంసమాదాయ పురమధ్యే ప్రవేశయేత్।
నగరం పట్టణం వాపి గ్రామం వా యది వా గృహం॥
అచిరేణైవ కాలేన శ్మశానం త ద్భవిష్యతి॥

ఘోరమండలసంప్రాప్తిః పరచక్రస్య చాగమః ।
అనారోగ్య మనావృష్టిః దుర్భిక్షం జనమారకం ॥
సంగ్రామం శస్త్రసంఘాతం క్రిప్రమేవ వినిర్దిశేత్ ।
తత్ర శాంతిం ప్రవక్ష్యామి తస్య పాపస్య శాంతిదాం ॥

ప్రాసాదకలశ లింగార్చాభంగశాంతిః

యత్ర దేవకులే వజ్రం పతే ద్గృధ్రో భవా పునః ।
పంతస్య పతనేచైవ చూడాయా మగ్నిదర్శనం ॥
లింగం వా భిద్యతే యత్ర కంపతే చానిమిత్తతః ।
చూడాభంగో భవే ద్యత్ర ప్రతిమా భిద్యతే తథా ॥
గాత్రమోత్పాగో భవే త్తత్ర స్వామినో మరణం దిశేత్ ।
తత్ర శాంతిం ప్రవక్ష్యామి యేన సంపద్యతే శుభం ॥

మృగపక్షివైకృతశాంతిః

శ్లో॥ ప్రవిశంతి యదా గ్రామా నారణ్యా మృగపక్షిణః ।
అరణ్యం యాంతివా గ్రామ్యాః స్థలం యాంతి జలోద్భవాః ॥
స్థలజా వా జలం యాంతి ఘోరావా సంతి నిర్భయాః ।
రాజద్వారే పురద్వారే శివా శ్చ ప్యశివప్రదాః ॥
దివా రాత్రించరా వాపి రాత్రా వపి దివాచరాః ।
గ్రామ్యా స్త్యజంతి గ్రామంవా శూన్యతాం తస్య నిర్దిశేత్ ॥
ప్రదోషే కుక్కుటో నాసే హేమంతే వాపి కోకిలః ।
అర్కోదయేర్కాభిముఖీ శివా రౌతి భయం దిశేత్ ॥

వృక్షోత్పాతశాంతిః

శ్లో॥ పురేషు యేచ దృశ్యంతే పాదపా దైవచోదితాః ।
రుదంతోవా హసంతోవా వహంతోవా రసా భువి ॥
రుదంతో వ్యాధి రక్ష్యేతి హసంతో దేశవిభ్రమః ।
శాఖాభిపతనే కుర్యాత్ సంగ్రామే యోధపాతనం ॥

వృష్టివైకృతశాంతిః

శ్లో॥ అతివృష్టి రనావృష్టిః దుర్భిక్షదా భయం తతః ।
అనృతౌ తు దివానంతావృష్టి ర్వ్యాధిభయాయతు ॥
అనభ్రవైకృతా శ్చైవ విజ్ఞేయా రాజహింసకాః ॥
వైకృతాః = గర్జితాదయః,

జలాశయ వైకృతిః

శ్లో॥ నగరా దపసర్పంతే సమీప ముపయాంతిచ ।
నద్యానదప్రస్రవణా సిరస్రా వై భవంతివా ॥
షణ్మాసాభ్యంతరే తత్ర పరచక్రభయం భవేత్ ॥
వా॥ ఇత్యా ద్యద్భుతోపద్రవవిశేషాః తచ్ఛాంతయశ్చ విశేషేణ
శాంతికమలాకరే ద్రష్టవ్యాః ॥

శ్వాన పక్షి ఉత్పాతా శాంతయః

శ్లో॥ శ్వానంచ యమదిగ్భాగే తద్గృహం దుఃఖసంభవం ।
కర్ణచ్ఛేదం దోషహరం అన్యస్థానే శుభం భవేత్ ॥
గృహ స్యాగ్నేయదిగ్భాగే పక్షిస్థే శిశునాశనం ।
అన్యస్థానే శుభంచైవ శిల్పకేరళనిర్ణయః ॥
గృహే పశ్చిమభాగేచ రావణోహస్త జాయతే ।
తద్గృహం నాశనం చైవ షణ్మాసం దోషవర్జితం ॥

తా:— ఇంటిపై దక్షిణపువైపున కుక్కయెక్కినచో దోషము. దానిచెవులుకోసినచో దోషహారమగును. ఇతరస్థానములయం దెక్కినచో శుభము, ఇంటిపై యాగ్నేయమున పక్షి వ్రాలిన శిశునాశనం, తరస్థానములయందు శుభకరము, ఇంటిలో పడమరవైపున రావణహస్తము మొలచినచో ఆయింటిని 6 మాసములు వదలి, పిమ్మట శాంతిచేసికొని ప్రవేశించవలెను.

నోటు:— ఎఱుపు తెలుపు రంగులు గలది రామహస్తము దీనికి దోషములేదు. నలుపురంగు దుర్వాసనగలది రావణహస్తము, ఇది దోషయుక్తము. కనుక శాంతిచేసికొనవలెను,

గృహమధ్యయందును, దక్షిణమునను, ఈశాన్య నైరృతి మూలలందును తేనెపెట్టులు, పుట్టలు, మొండిచేతులు కలుగరాదు. అట్లుకలిగిన్ల ఆయింటిని 6 మాసములు వదలి, పిమ్మట శాంతి చేసికొని యింటలో ప్రవేశించవలెను.

## తేనెపట్టు

ఇంటిలో యజమాని కరిష్టము, అవరణలో ఇంటికి తూర్పున ధనలాభము. ఆగ్నేయమున అగ్నిభయము. దక్షిణమున మరణము, నైరృతిని ధాన్యనాశనము, పడమర మనోవ్యాధి, వాయవ్యం ధనలాభం ఉత్తరం సంతానవృద్ధి. ఈశాన్యం పుణ్యకార్యం లేక తీర్థయాత్ర.

ఏదిక్కునందైనను త్రికోణాకారముగా కాని, చేటవలెగాని, నల్ల చదరముగాగాని పట్టెనని శాస్త్రోక్తముగా శాంతి చేయవలెను. శాంతి కమలాకరమున శాంతివిధానము గలదు.

## మట్టిగూడు

గృహమధ్యమున భార్య కరిష్టము. ప్రాగ్భాగమున యజమాని కరిష్టము. ఆగ్నేయమున భయము. దక్షిణనైరృతులయందు ఒకనికి మృత్యువు. పశ్చిమమున రాజ్యపూజ్యత. వాయవ్యమున బంధుసంయోగము. ఉత్తరం పశునాశనం. ఈశాన్యమున పశులాభం.

## గ్రద్ద - గుడ్లగూబ యింట ప్రవేశించినచో

గ్రద్ద గుడ్లగూబ జీలుగ యింటినడుమ దక్షిణముఖముగా కూర్చుండినను, యింటియందు ప్రవేశించినను ఆగృహము 6 మాసములు వదలవలెను. అనంతరం విధ్యుక్తముగా శాంతిచేయించి యింట ప్రవేశించవలెను. లేనిచో యజమాని కరిష్టము.

నోటు:- గృహమధ్యమునను, గృహమునకు ఆగ్నేయ దక్షిణ నైరృతి వాయవ్య భాగములయందును తేనెపట్టు, మట్టిగూడు, మొండి చేయి మొలచినను, గ్రద్ద గుడ్లగూబ జీలుగ వ్రాలినను ఆయింట మరణము గల్గును. కనుక శాస్త్రోక్తరీతిని శాంతిచేసికొనవలెను. మిగిలిన దిక్కులయందు ఇవి శుభము గల్గించును.

అద్భుతోత్పాతశాంతిః

పావురము గుడ్లగూబ గ్రద్ద కాకి సర్పము పీనిలో నేదియైనను యింటిలో ప్రవేశించినను, ఆవు తనపాలుతాను త్రాగినను, గోవు రెండు దూడలను కనినను, తేనెతెట్టె మొండిచేయి పుట్ట మొదలగునవి అవరణలో కలిగినను ఆగ్నేయము నైరృతి దక్షిణము పడమర వాయవ్యము ఈదిక్కులయం దరటిచెట్టు గెలవేసినను, సింహమాసములో గోవులు ప్రసవించినను, ఆశ్వీయుజమాసములో గుఱ్ఱము ఈనినను, కార్తీకమాసములో దాసి ప్రసవించినను, మాఘమాసములో గేదె ఈనినను, కాకమైథునమును జూచినను, కాకి నెత్తిపై వ్రాలినను, శిరస్సునగాని వక్షస్థలమునైగాని గోళ్ళతోగీరినను, పరున్నవానిని కాకి తాకినను. ఇవి యన్నియు అద్భుతోత్పాతములే! వీనికి యధావిధి శాంతిచేసికొనవలెను.

శాంతి విధానమును శాంతికములాకరమున జూడవలెను.

అథ పల్లీసరటశాంతిః

బల్లి శరీరముపై పడినను, తొండ శరీరముపై ప్రాకినను ఈ క్రిందవ్రాసిన విధముగా ఫలములను తెలిసికొనవలెను, శిరస్సున రాజ్యసంపదలు గలుగును. నేత్రములయందు బంధుదర్శనము, ముక్కున సౌభాగ్యము, నోటిపై మృష్టాన్నభోజనము, కంఠమున ప్రియాలింగనము మెడలపై విజయము, మోచేతులకు పైభాగమున ధనలాభము, క్రింది చేతులపై ద్రవ్యమును జూడబట్టుట, వక్షస్థలమున సౌభాగ్యము, పుత్రప్రీతి, పొట్టపై పుత్రలాభము, బొడ్డుపై కీర్తి, వీపునవస్త్రలాభము, తొడలపై వాహనలాభము, పిక్కలపై సిరుద్యోగము, పాదములపై తిరుగుడు.

పాదములవయినుండి శిరస్సువరకు ప్రాకినను శరీరమునకు సవ్యప్రదక్షిణముచేసినను రాజ్యలాభము శిరస్సు మొదలుకొని పాదములవరకు

ప్రాకినను శరీరమున కప్రదక్షిణ మాచరించినను హాని శోకములు కలుగును.

తొండ ఏయవయవములయందైనను ఎప్పుడు పడినను హానికలుగును. క్రిందికిగాని పయికిగాని ప్రాకినచో కుటుంబకలహము కలుగును.

బల్లిపడినను తొండప్రాకినను 5 రోజులలో నతనికి రోగపీడ కలుగును. పడినపిమ్మట ప్రాకినచో పడినఫలమేగాని ప్రాకినఫలము కలుగదు.

వాటిని తాకినమాత్రముననే సచేలస్నానము నాచరించవలెను. పంచగవ్యప్రాశనచేసి ఆజ్యావలోకనము జేయవలెను. పుణ్యాహవాచనము నాచరించి యంతట శాంతిచేసికొనవలెను.

బంగారముచే వాటిప్రతిమను చేయించి ఎఱ్ఱగుడ్డను అప్రతిమకు చుట్టి గంధపుష్పాక్షతలచే పూజించవలెను. అగ్నిప్రతిష్ఠాపనచేసి యథావిధి హోమము నాచరించవలెను; తిలాజ్యసమితే సక్తువులచేత 1008గాని, 108 గాని పర్యాయములు హోమములుచేసి యజమానుని శిరస్సుపయి వరుణమంత్రములచే నభిషేకము నాచరించవలెను. గోదానమునుకూడ చేయవలెను.

ఇతి శ్రీ సూరిపరపు వేంకటశివసోమయాజిసంగ్రహితే
ధర్మనిర్ణయచంద్రికా నామక ధర్మశాస్త్రగ్రంథే
శాంత్యాది నిరూపణం నామ
ప్రథమభాగ స్సమాప్తః

